# ఆదర్శ ప్రజా రాజ్యం
# ప్రజాతంత్ర ప్రభుత్వం
# నమూనా రాజ్యాంగ రచన

23/4-97




రచయిత

వణుకూరి వెంకటరెడ్డి

ప్రతులు : 1000

28-9-1997

వెల : 21-00

ప్రాప్తిస్థానము :

**శ్రీ టి. ఆదిరెడ్డి**

ఇంటి నెం. 18

1వ లైను, వేణుగోపాల నగర్

N.G.G.O'S Colony

గుంటూరు - 522004

ముద్రణ :

షిరిడిసాయి ప్రింటర్స్,

2/1, అరండల్ పేట,

గుంటూరు - 2.

ఫోన్ : 353893

# విషయసూచిక

# పరిచయము

ఆదర్శ ప్రజారాజ్యం, ప్రజాతంత్ర ప్రభుత్వం, నమూనా రాజ్యాంగ రచన స్వాతంత్ర్య స్వర్ణోత్సవ సందర్భంలో భారతజాతికి పరిచయం గణతంత్ర రాజ్యం 50 సంవత్సరములు పరిపాలన పార్లమెంటు ఉభయసభలు జరిపిన సర్వోన్నత్సవ సమీక్ష సమావేశంలో పరిపాలనా బలహీనతలు, జాతికి జరిగిన అన్యాయం తేటతెల్లమయింది. హక్కులు కల్పించి, బాధ్యతలు విస్మరించిన గణతంత్ర రాజ్యం పాలనలో స్వర్ణోత్సవాలేకాదు శతాబ్ది ఉత్సవాలు జరుపుకున్నా అవినీతి, అధికారదాహం, పదవివ్యామోహం, ఆర్థికస్వార్థం, ఆత్మవంచెన, పరనిందలు అరికట్టు అవకాశములులేవు. జాతిలో విపక్షతలు తొలిగించి సమైక్యత కల్పించు అవుకాశములు లేవు. పరిపాలనాపార్టీ, పార్టీపోషణ పథకాలు అమలుజరుపుతారు, కాని ప్రజాపోషణ పథకాలు అమలుజరుపరు. అధికారపార్టి అడుగడుగున నియంతృత్వంతో పాలన చెలాయిస్తుంది. కాని, ప్రజలకు జవాబుదారిగా పనిచేయదు. పరిపాలనాధర్మాలు నిర్వర్తించు బాధ్యత ఎవరిదో తెలియదు, బాధ్యతలేని పాలనావిధానాలలో 1 రాజకీయ పోరాటాలు, ఉద్యోగ, కార్మిక, కర్షక, కుల, మత పోరాటాలు వున్నంత కాలం న్యాయమైన ప్రజాస్వామిక పరిపాలన అమలుజరుగు అవకాశములు లేవు. బూటకపు ప్రజాస్వామిక పరిపాలనలో పౌరుని ప్రాథమిక హక్కులు స్వేచ్ఛాస్వాతంత్ర్యం అణచివేయబడుచున్నది. గణతంత్రం రాజ్యాంగపరిధిలో కల్పించిన హక్కులతోనే ప్రజాస్వామ్యాన్ని అణచివేయుచున్నది. ప్రజలు హక్కులు స్వేచ్ఛా

స్వాతంత్ర్యం అనుభవించవలెనంటే గణతంత్ర రాజ్యానికి స్వస్తిపలికి ప్రజాతంత్ర రాజ్యాన్ని రూపొందించుకోవలసివున్నది.

ప్రజలు రాజులుగా వారి ఆధిక్యత కొనసాగిస్తూ ప్రాతినిధ్యాన్ని ఎన్నికచేసి పాలనాసేవాధికారాలు దత్తంచేసి పాలనాసేవలు ప్రజలు ఇండ్లకు అందుకొను విధంగా జవాబుదారి పరిపాలన నెలకొల్పుకో వలసివున్నది. ప్రజలే ప్రభుత్వాన్ని నెలకొల్పుకున్నపుడు పరిపాల నలో వివక్షతలకు తావువుండదు.

1) విద్య విజ్ఞానం 2) వైద్యం ఆరోగ్యం 3) నివాసం 4) పని పౌరుని ప్రాథమిక హక్కుగా గుర్తించబడుతుంది. పల్లెలు పట్టణాలవలె సకల సౌకర్యాలు కనిపించబడుతవి. పట్టణ వాసులు తిరిగి పల్లెలదారి పట్టు సౌకర్యాలు పల్లెలు ఏర్పరుచుకొంటవి. ప్రజల ఆదర్శంతో నెలకొల్పుకొను రాజ్యం ఆదర్శప్రజారాజ్యంగా నామ కరణముచేసి ప్రజలముందుంచటం జరుగుతుంది. సామాజికన్యాయం సాంస్కృతిక సమానత్వం, ఆర్థికన్యాయం కల్పిస్తూ, "నమూనా రాజ్యాంగ రచన"కు రూపమిచ్చిన వెంకటరెడ్డి అనే నేను విద్యా వేత్తను, మేధావిని కాను, అక్షర అభ్యాసిని సన్నకారు రైతును. అయితే ప్రకృతాత్మ ప్రసాదించిన విజ్ఞానంతో కుటుంబాన్ని పరిగణన లోకి తీసుకొని కుటుంబపాలన, గ్రామపాలన, జిల్లాపాలన, రాష్ట్ర పాలన, జాతీయపాలన మీద పరిశోధనచేసి సామాజిక ఆర్థిక రాజ కీయపాలన న్యాయధర్మాలు ఆధారంగా పరిపాలనకు సరియైన విధా నాలు, న్యాయరక్షణకు సరియైన విధానాలు రూపొందించి రచించిన ఆదర్శ ప్రజారాజ్యంలో నిరక్షరాస్యత, నిరుద్యోగం, దరిద్రం తొల

గించుటకు దేశాన్ని ఋణవిముక్తి కావించి, స్వయంసమృద్ధి దేశంగా భారతదేశాన్ని తీర్చిదిద్దుటకు 5 సం॥లు కాలపరిమితి విధించి పరిపాలన కార్యక్రమం రూపొందించటం జరిగింది. ప్రజలు జాగరూకులై విపక్షతలు తొలిగించుకొని సమైక్యంగా ప్రజాతంత్రంతో రాజ్యాంగానికి నిజరూపం యిచ్చి, ప్రజాతంత్రంతో ప్రభుత్వాన్ని నెలకొల్పుకొనుటకు ముందుకువస్తే ఆదర్శ ప్రజారాజ్య రచన ప్రజలకు దారి చూపిస్తుంది.

నిజమైన ప్రజాస్వామిక పరిపాలనలో ప్రతి ఒక్కరు సుఖ సంతోషాలతో సకల ఐశ్వర్యములు అనుభవించవచ్చు. దేహి అనే శబ్దం వినబడదు. ప్రజాస్వామిక దేశానికి ప్రజలు రాజులు, పాలకులు, సేవకులు ప్రజాస్వామిక ప్రభుత్వం నిజస్వరూపం కల్పించిన "నమూనా రాజ్యాంగ రచనం ఇది.

ఈ రచనలో ప్రపంచ ప్రజాస్వామ్య దేశాలలో నిజమైన ప్రజాస్వామిక రాజ్యాంగ వ్యవస్థ నూతనాధ్యాయము ప్రారంభమవుతుంది. గత చరిత్రలు మరుగునపడి పోతవి.

ఈ పుస్తకములో చదువరులకు అచ్చుతప్పులు కనబడిన ఎడల వాటిని భావమునకు సరిచూచుకొనవలెను.

— జైహింద్ —

రచయిత

వణుకూరి వెంకటరెడ్డి

25-4-1997

# ఆదర్శ ప్రజా రాజ్యం
# ప్రజాతంత్ర ప్రభుత్వం
# నమూనా రచన



పందొమ్మిదినందల నలుబది ఏడు సంవత్సరంలో భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. రాజకీయ విప్లవం సమశిపోయింది. కాని వలసపాలన చట్టాలు మనలను వదలలేదు. ప్రజాపాలన చట్టాలు రూపొందలేదు. వలసపాలన చట్టాలు వదిలించుకొనుటకు ప్రజాపాలన చట్టాలు నెలకొల్పుకొనుటకు మరొక జాతీయ రాజకీయ విప్లవం ఇప్పుడు అవుసరమైనది.

వలసపాలకులు జాతిని దోపిడిచేస్తున్నారని మనకున్న వ్యక్తి స్వాతంత్ర్యాన్ని అణచివేస్తున్నారని ఆనాడు జాతీయ విప్లవం బయలుదేరింది. స్వేచ్ఛాస్వాతంత్ర్యం సంపాదించింది ఆనాడు. సంపాదించిన స్వేచ్ఛాస్వాతంత్ర్యం ఈనాడు రాజకీయ అధికారాలకు పరిమితమయింది, సామాన్యుని యధాస్థితిలో అణచిపెట్టింది. ఎవరికో ఒకరికి ఓటువేసి చేతులు దులుపుకోవటం ప్రజలకు కల్పించిన స్వేచ్ఛ. దాని వలన కలిగిన ఫలితం ఏదీలేకపోగా ప్రజలకు పాలనాభయం పట్టుకుంది. ప్రజాస్వామిక రాజ్యాంగం ప్రజలకు జవాబుదారిగా నెలకొల్పుకో కలిగినపుడే ప్రజలకు సంపూర్ణ స్వేచ్ఛాస్వాతంత్ర్యం లభిస్తుంది. ప్రజలు సంపూర్ణ స్వేచ్ఛాస్వాతంత్ర్యం పొందుటకు మరొక జాతీయ విప్లవం అవసరమైనది.

అవినీతికి అన్యాయ పాలనకు అవకాశాలు కల్పించిన గణతంత్ర రాజ్యపాలనలో ప్రజలకు సంపూర్ణస్వాతంత్ర్యం లభించు అవకాశం లేదు. ప్రజలు అధికారికంగా పార్టీలను మార్చినను పార్టీలు రాజ్యాంగం కల్పించిన అధికారం హక్కు రాజకీయపార్టీల స్వార్థానికి ఉపయోగపడుచున్నది. అధికారదాహం తీర్చుకొనుటకు అన్ని పార్టీలు తప్పుదారులు సృష్టించి, ప్రజలను విషవలయంలో అణచి వేస్తున్నవి. గణతంత్ర రాజ్యాంగం జాతీయ విధానాన్ని మరుగుపర్చి కులవ్యవస్థను రెచ్చగొట్టింది. దారిద్ర్యాన్ని వెనుకబడినతనాన్ని విద్యగరుపుటద్వారా ఆర్థిక వనరులు సమకూర్చుటద్వారా తొల గించవలసిన జాతీయ విధానాన్ని విడనాడి రాజకీయ అధికారాలు కల్పించుటద్వారా, ఉద్యోగాలు కల్పించుటద్వారా, వెనుకబడిన తనాన్ని తొలగించాలని తలచటంలో రాజ్యాంగ ధర్మాలు అన్ని పతనమైనవి. విలువలు నీరుకారిపోయినవి. పరిపాలనలో పట్టు పోయింది. ధనంతో విద్యను, ఉద్యోగాన్ని కొని అసమర్థులు అధికా రంలో కొనసాగుచున్నారు. అవినీతి స్వార్థానికి రాచబాటలేర్పడి నవి. ఆశావాదులు అధికారాలు చేపట్టి ధనార్జనకు పూనుకున్నారు. కులపోరాటాలు సృష్టించి అధికారం పట్టుకొనుచున్నారు. రాజకీయ అధికారాలకు కల్పించిన హక్కులు హద్దులు లేనివైనందున గణతంత్ర రాజ్యం పరిధిలో జాతిపరిపాలన విద్రోహానికి బలియగుచున్నది.

గణతంత్ర రాజ్యాంగం మంచిదేనని దానిని నిర్వర్తించేవారు చెడగొట్టుచున్నారని కొందరి వాదన. అసలు రాజ్యాంగ అవసరం మానవుని దుర్గుణాలు అదుపుచేసి సద్గుణాలు కల్పించుటకనే విష యాన్ని రాజ్యాంగనిర్మాతలు గుర్తించి రాయనందుననే మానవ

స్వార్థం విచ్చలవిడిగా పెరిగిపోవుటకు దుష్టుల విలువలు పెరిగిపోవుటకు కారణమైంది. గణతంత్ర రాజ్యం కల్పించిన హక్కులు, అధికారాలు, హద్దులులేనివైనందుననే ఈనాడు ప్రధానమంత్రి ఇష్టారాజ్యంగా దేశం, ముఖ్యమంత్రి ఇష్టారాజ్యంగా రాష్ట్రాలు, కొనసాగిస్తున్నారు. భారతదేశంలో మూడు పువ్వులు, ఆరు కాయలుగా ప్రజాస్వామ్యం వర్ధిల్లుతుందని ఉపన్యాసాలు ఇచ్చేవారు, గణతంత్ర రాజ్యాన్ని తన అధికారానికి బలిపశువునుచేసి వాడుకొనుచున్నారనే విషయానికి ఈ దిగువ వివరణలు సాక్ష్యాధారాలు.

1. గణతంత్ర రాజ్యం ప్రజలకు ఓటుహక్కు కల్పించింది. కాని వారు రాజ్యాంగ ప్రతినిధిని ఎన్నుకునే హక్కు వారికి కల్పించలేదు. ఆ హక్కు పార్టీలకు కల్పించాలి.

2. గణతంత్ర రాజ్యం ప్రతినిధులు ప్రజలనుండి ఓటుతీసుకోవటం ప్రాతినిధ్య హక్కుగా కల్పించింది, కాని ప్రజాసేవే హక్కుగా ప్రాతినిధ్యానికి కల్పించలేదు.

3. ప్రజలను తోసి రాజ్యాన్ని ప్రజలచేత ఎన్నికచేయబడిన ప్రాతినిధ్యానికైనా ప్రభుత్వం నుండి సమాధానం రాబట్టే జవాబు దారి విధానం కల్పించిందా అంటే అదిలేదు, మెజార్టీ చేత అధికారం తొక్కిపెట్టె విధానం కల్పించబడింది.

4. గణతంత్ర రాజ్యం చట్టసభలకు, సభాసభ్యులకు పాలన రహస్యాలు తెలియజేయునపుడు చట్టసభలు ఉపన్యాసవేదికలుగా రూపొందినవనుటలో సందేహంలేదు.

5. చట్టసభ్యులను త్రోసి రాజనినా, కార్యనిర్వాహక కార్య, వర్గానికైన పాలనారహస్యాలు తెలుసుకొను సంపూర్ణ స్వేచ్ఛ కల్పించిందా అంటే అదీ లేదు. ప్రధానమంత్రి ముఖ్యమంత్రుల ఇష్టా ఇష్టాలపై కార్యనిర్వాహక కార్యవర్గానికి రహస్యాలు తెలియపర్చటం జరుగుతుంది.

6. భారతదేశంలో వ్యక్తిపాలన కొనసాగుచున్నదని చట్ట సభ్యులు, కార్యనిర్వాహక కార్యవర్గాలు, ఉత్సవిగ్రహాలని ప్రజలు పాలన పీడితులేకాని పాలనాపోషకులు కాదని ప్రభుత్వంలో జవాబు దారి విధానాలతో రాజ్యాంగం రూపొందలేదని ఇప్పటి పాలనచర్యల వల్ల రుజువు అయింది. రాజకీయహత్యలు, ఆర్థికదోపిడీలు, నేరచరితులను న్యాయవిచారణకు అతీతంగాచేసి న్యాయాన్ని నిర్మూలించే విధానాలు వింటుంటే గణతంత్ర రాజ్యాంగం కల్పించిన అధికార పరిధిలో రాజకీయ అధికారాలకు బాధ్యతలు, హద్దులు జవాబుదారి పాలనావిధానాలు లేవని స్పష్టంగా ఆచరణలో నిర్ధారణ అయింది. రహస్యపరిశోధనలు, న్యాయ అన్యాయాలతో నిమిత్తం లేకుండా శత్రువర్గాన్ని అణచవేయుటకు మిత్రవర్గాన్ని రక్షించుకొనుటకు అనే విషయాన్ని ప్రస్తుత న్యాయవ్యవస్థ నిర్ధారణకు వచ్చింది.

గణతంత్ర రాజ్యం రాజకీయ అధికార వైఫల్యాలను అదుపు చేసి సరియైన విధానంలో ప్రభుత్వం పాలన విధానాలు అమలు జరుపుటకు సంపూర్ణ న్యాయపరిధి పర్యవేక్షణ అధికారాలు న్యాయ వ్యవస్థకు కల్పించి ప్రజలకు జవాబుదారీ విధానాన్ని న్యాయవ్యవస్థకు కల్పించివుంటే వ్యక్తులస్వార్థం అరికట్టు అవకాశం వుండేది. అలా కాకుండా న్యాయాధికారాలను రాజకీయాధికార పరిధులకు కుదించి

వేశింది. కేంద్రంలోను, రాష్ట్రాలలోను నాయకత్వపరిధిలో వ్యక్తి ఇష్టపాలన కొనసాగించుటకు రాజ్యాంగం ఒక అస్త్రంగా ఉపయోగ పడి, జాతివిలువలు పోగొట్టుటకు జాతివిద్రోహశక్తిని పెంచుటకు రాజ్యాంగం ప్రత్యక్షంగా తోడ్పడింది. కులమత కలహాలకు కారణ మైన గణతంత్ర రాజ్యాంగానికి స్వస్తిపలికి మరి ఒక విప్లవంద్వారా ప్రజాతంత్రంతో ప్రభుత్వాన్ని నెలకొల్పుకొనుటకు ప్రజలు ఆద ర్శంతో నెలకొల్పుకొను రాజ్యం ఆదర్శ ప్రజారాజ్యంగా నామకరణం చేసి, రచనకు ఉపక్రమించటం జరుగుచున్నది. ప్రజలు రాజులుగా వారి ఆధిక్యత కొనసాగిస్తూ, రాజ్యాంగ సభలకు వారి ప్రతినిధులను వారు ఎన్నికచేసి పంపించే విధానంలో పాలనసేవలు ప్రజల ఇండ్లకు అందుకొను విధంగా జవాబుదారిపాలన కల్పించుటలో ప్రజలు తృప్తి చెందనపుడు ప్రాతినిధ్యం రద్దవవిధంగాను ప్రజలను సంతృప్తిపరచని పాలనాయంత్రాంగ ఉద్యోగం రద్దయేవిధంగాను, రాజ్యాంగపాల నాధికారాలు నిర్ధారించి, శక్తికలిగిన రాజ్యంగా ఆదర్శ ప్రజారాజ్య రచన ఇది.

ప్రజలకు పాలన ఎంత జవాబుదారిగా పనిచేస్తుందో, పాలనకు ప్రజలు అంతజవాబుదారిగా సమాధానం ఇవ్వాలి. ఒకరికి ఇంకొకరు అన్యోన్యంగా కలసిమెలసి జవాబుదారిగా పరస్పర అవగాహనతో ఉత్పత్తి నిర్విరామంగా కొనసాగించి, దేశాన్ని ప్రపంచదేశాలలో అగ్రభాగానికి చేర్చటం అందరిబాధ్యత. సాంఘికంగా, ఆర్థికంగా విద్యావిషయంగా జాతికి ఒక అవగాహన కల్పించి, సామాజిక న్యాయం సాంస్కృతిక సమానత్వం కల్పించుటకు విద్యార్థిదశనుండి అందరం సమానమనే అవగాహన కల్పించుటకు వేరు వేరు విద్యా

విధానాలు అన్ని రద్దుచేసి జాతీయంగా ఒకే విద్యావిధానం కల్పించి కుల వివక్షతలు తొలగించాలి. త్రిభాషసూత్రం ఆధారంగా సంపూర్ణ విద్యావిధానాన్ని ప్రభుత్వం నిర్వహించాలి. ఆర్థిక సాంఘిక వ్యత్యాసాలతో నిమిత్తం లేకుండా ప్రతిభ ఆధారం, విద్యావిధానాన్ని శాస్త్రీయ పరిశోధనల వరకు అందరికి ఉచితవిద్య అవలంబించాలి. సామాజిక న్యాయం, సామాజిక తత్వం, సమకాలిక విధానంలో పరస్పర అవగాహన పెంపొందించాలి. పదితరగతులు 18 సంవత్సరం పూర్తిచేయువరకు నిర్భంధవృత్తి విద్యావిధానాన్ని అమలుజరపాలి. తదుపరి నెలకొల్పు ప్రతిభ ఆధారవిద్యను అందుకోలేనివారు వృత్తి ధర్మాన్ని చేపట్టు విధంగా విద్యాబోధన వృత్తి ఉపాధి ఆధారమైనదిగా వుండాలి. త్రిభాషలలో ధారాళంగా మాట్లాడకలిగి, వ్రాయ కలిగి విద్యార్థి వుండాలి. జీవనాధారాలు కల్పించుకొను శక్తిసామర్థ్యం కలిగి పదివతరగతి విద్యార్థిగావుండాలి.

1) విద్యావిజ్ఞానం 2) వైద్యం ఆరోగ్యం 3) నివాసం 4) పని పౌరుని ప్రాథమిక హక్కుగా రాజ్యాంగంలో పొందుపర్చి, ఉద్యోగం ఉపాధిహక్కును తొలగించాలి. రాజకీయ అధికారాలు పాలనాధికారాలు శ్రమశక్తి నిపుణత ప్రతిభ, బాధ్యతలు ఆధారంగా రాజకీయ ఉద్యోగ అధికారాలు కల్పించాలి. ప్రజాస్వామిక పరిపాలనలో ఎటువంటి యూనియన్లు స్థాపించుటకు అవకాశంలేదు. నిరంకుశాన్ని ఎవరు వినియోగించానా ప్రస్తుత భారతదేశ పాలన పరిస్థితులు ఏర్పడుతవి, వర్గనియంతృత్వం ప్రజాస్వామిక దేశంలో పనిచేయ కూడదు. సంపూర్ణ ప్రజాస్వామ్యంలో జీవనహక్కు ఆస్థిహక్కు అందరికి వుంటుంది. వ్యత్యాసం ఆ యా వ్యక్తుల శక్తిసామర్థ్యం

విద్యావిధానం కల్పించి
తం ఆధారంగా సంపూర్ణ
ఆర్థిక సాంఘిక వ్యత్యా
రం, విద్యావిధానాన్ని
తవిద్య అవలంబించాలి.
సమకాలిక విధానంలో
రగతులు 18 సంవత్సరం
నాన్ని అమలుజరపాలి.
అందుకోలేనివారు వృత్తి
ృత్తి ఉపాధి ఆధారమైన
మాట్లాడకలిగి, వ్రాయ
ంచుకొను శక్తిసామర్థ్యం

గ్యం 3) నివాసం 4) పని
పొందుపర్చి, ఉద్యోగం
అధికారాలు పాలనాధికా
తలు ఆధారంగా రాజకీయ
్వామిక పరిపాలనలో ఎటు
కాశంలేదు. నిరంకుశాన్ని
దేశ పాలన పరిస్థితులు
మిక దేశంలో పనిచేయ
జీవనహక్కు ఆస్థిహక్కు
వ్యక్కుల శక్తిసామర్థ్యం

ఆధారంగా హెచ్చుతగ్గులు వుంటవి. ఆస్థి హక్కును సమానంగా కల్పించకూడదా అని కొందరు ప్రశ్నించవచ్చు. కాని ఆస్థి హక్కును సమానంచేస్తే దేశభవిష్యత్ మానవుని మేధాశక్తి దెబ్బతింటుంది. మానవుడు ఆశావాది. మేధాశక్తి ఆశ ఆధారంగా అవకాశాన్ని పెంపొందించుకొంటుంది. శ్రమశక్తి ఉత్పత్తికారకాలు ఆర్థిక వ్యత్యాసాల గుర్తింపు వలననే పెరుగుతవి. సామాజిక పునర్నిర్మాణం ఈ దశలోనే అభివృద్ధి జెందుతుంది. వ్యక్తి పురోగమనానికి. వ్యక్తి మేధాశక్తి పెంపొందించుకొనుటకు పోటీతత్వం కల్పించటం అవసరం. మానవుని వికాసం పోటీకల్పించినపుడు పెరుగుతుంది. శ్రమశక్తి నిపుణత పోటీలోనే పెరుగుతుంది. పోటి దేశాభివృద్ధికి బాగా ఉపయోగపడుతుంది. ఈ దిశలో పెరిగిన ఆర్థిక వ్యత్యాసం దేశాభివృద్ధికి తోడ్పడుతుంది.

రాజరికరాజ్యమైనా ప్రజాస్వామిక రాజ్యమైనా ప్రజలహక్కులు ప్రభుత్వం హక్కులు వేరువేరుగా వుంటవి. కాని ప్రజలు ప్రభుత్వము ఎవరిబాధ్యతలు వారు కలిసి నిర్వర్తించినపుడు స్వాయంసమృద్ధి సాధ్యం అవుతుంది. ప్రజలు పాలనలో భాగస్వాములైనపుడు ప్రభుత్వం ఉత్పత్తి వాణిజ్యంలో దానిపాత్ర అది నిర్వహిస్తుంది. సాంకేతిక ఆర్థిక వాణిజ్య సహాయాలు ప్రతివ్యక్తికి ప్రతివృత్తికి అందిస్తుంది. ప్రస్తుత గణతంత్ర పరిపాలనకు ప్రజాతంత్రపాలన భిన్నంగా వుంటుంది. దేశాభివృద్ధిలో ప్రజలకు ప్రభుత్వానికి సమబాధ్యతలు వుంటవి. ఆదర్శప్రజారాజ్యం రచనలో ఈవిధానం రూపొందిస్తుంది. నిజమైన ప్రజాస్వామిక రాజ్యంలో సంపూర్ణ ప్రజాస్వామికపాలనలో ప్రజలపాలకుల బాధ్యతలు పెంచబడుచున్నవి. ప్రపంచ ప్రజాస్వామిక

దేశాలలో ఇంతవరకు నిజమైన ప్రజాస్వామిక రాజ్యాంగ రచన రచించబడలేదు. ఇదే ప్రప్రథమ ప్రజాస్వామిక రాజ్యాంగ రచన.

మానవుని మనుగడ దేశరక్షణ ప్రజాస్వామిక పాలన దేశానికి బలమైన ఆధారం. బలమైన ఆధారమార్గంలో ఆదర్శ ప్రజా రాజ్యం రచన కొనసాగుతుంది. ప్రజలు ఎన్నికచేయు ప్రజాప్రతినిధికి రాజ్యాంగపద్ధతులు, బాధ్యతలు తెలియనివారైనను పాలనాచట్టాలు రూపొందించుటకు పూనుకున్నపుడు రాజ్యాంగమే పాలనచట్టాలు ఏలావుండవలెనో మార్గం చూపిస్తుంది. రాజ్యాంగసభలు రూపొందించిన చట్టాలు న్యాయపరిశీలన పరిధిలో వృత్తిధర్మం వృత్తిన్యాయం ప్రధానమైనవిగా రాజ్యాంగ రచన కొనసాగుతుంది. జాతీయస్థాయి అధికారాలు, రాష్ట్రస్థాయి అధికారాలు, జిల్లాస్థాయి అధికారాలు, గ్రామస్థాయి అధికారాలు వారివారి పరిధులలో పాలనాబాధ్యతలు హద్దులు హక్కులు నిర్ధారించి అధికార విభజనచేయుటం నాలుగు అంచెల రాజ్యాంగాన్ని రచించి, వికేంద్రీకరణ విధానాన్ని అమలు జరుపటం రచయిత వుద్దేశం.

ప్రథమ భాగం :

## రాజ్యాంగం - రాజ్యాంగ విభాగాలు

1. రాజ్యాంగ అవుసరం
2. రాజ్యాంగ విధులు
3. ప్రజాప్రభుత్వ విధులు
4. ప్రజాపాలన విధులు
5. ప్రజాపోషణ
6. న్యాయరక్షణ విధులు

ఈ ఆరు సూత్రాల ఆధారంగా ఆదర్శ ప్రజారాజ్యం రచన కొనసాగుచున్నది.

1. రాజ్యాంగ అవసరం :

మానవుడు ఆటవిక ప్రపంచంలో జంతువులవలె మసలుకొనుచూ కండబలం కలవారు బలహీనులను వేధిస్తున్నపుడు బలవంతులే దొరికిన ఆహారం స్వంతంచేసుకొనుచున్నపుడు బలహీనులందరు ఏకమై మానవుని ఉనికి సంరక్షణకు సాంఘిక న్యాయం అనే ఆలోచన మొదలైంది. ఆ సాంఘిక ఆలోచనలో నివాసం గూడెం సంఘం, గూడెం పెద్ద, గూడెం న్యాయం తప్పుచేసినవానిని శిక్షించు అధికారం వనరులు, విభజన వనరులు, సంరక్షణ అతిక్రమించేవారిని శిక్షించుటకు పరిపాలన సంఘుబంట్రోతు విధానం గూడెం పాలన క్రమేపి గ్రామ పాలనగా పెద్దరికానికి వారసత్వం సంక్రమించింది. గ్రామానికి గ్రామానికి మధ్యన వనరులు వినియోగించుకొనుటలో వైరాలు పెరిగి గ్రామాలు బలప్రదర్శనకు పూనుకొని, బలంగల గ్రామాలు బలహీనుల గ్రామాలను ఆక్రమించుటద్వారా చిన్నచిన్న రాజరికాలు మొదలైనవి, రాజ్యాన్ని రక్షించుకొనుటకు కాని, ఇతర రాజ్యాలను ఆక్రమించుకొనుటకు కాని, సైన్యాలను నెలకొల్పుకోవటం ప్రతి చిన్న రాజ్యానికి అవసరమేర్పడినది. దురహంకారులు అధికారవిస్తరణకు సైనికబలాలుపెంచి ఇతర బలహీనరాజ్యాలు ఆక్రమించు విధానంలోనే రాజులు, మహారాజులు, చక్రవర్తులు దేశపాలకులుగా రూపాంతరం చెందటం జరిగింది.

రాజరికపాలనలో గ్రామపాలన ఫునికి కోల్పోయింది. పెద్ద చిన్నా అందరు రాజాజ్ఞకు బద్ధులు కావలసివచ్చింది. యుద్ధాల

హోరులో ప్రజలు బలిపశువులుగా వాడబడుచున్నారు. కరువులు కాటకాలువచ్చినా ప్రజలను పలుకరించే దిక్కు లేకుండాపోయింది. జన జీవనం అస్తవ్యస్తమైంది. జనజాగృతం పెరుగనారంభమైంది. రాజరికా లకు తిలోదకాలివ్వాలనే ఉద్యమం పెరుగుచున్నది. ప్రభుత్వం వత్తి డిలు శిక్షలు మరణదండనలకు ఎరువకుండా జనచైతన్యం పెరిగింది. చక్రవర్తులను ధిక్కరించి ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని నెలకొల్పుకొని ఏబదిసంవత్సరములు స్వజాతి ప్రాతిసిధ్యపాలనలో తిరిగి వేలసంవత్స రాలనాటి వెనుకటి మానవజీవనం వనరుల దోపిడి తిరిగి ఈనాడు గుర్తుకువచ్చింది. అరాచకంలో పెరిగిన నాగరికత జాతిని ఈ స్థితిలో నడిపిస్తుంది.

మానవుని జీవన గణితానికి ప్రకృతి సృష్టిగణితానికి అను సంధానం వున్నది. ఒకదానికి ఒకలెక్క, ఇంకొకదానికి ఇంకొకలెక్క కడితే అసలు మూలం చెడిపోతుంది. మానవుని జీవన గణితం ప్రకృతి సృష్టిగణితం రాజ్యాంగ నిర్మాణానికి సమతుల్యంచేస్తే ప్రజాస్వామిక పరిపాలన సరియైన నిర్మాణంలో రూపొందుతుంది. స్వేచ్ఛా స్వాతంత్ర్యం ప్రతివ్యక్తికి వుంటుంది. సామాజిక సాంస్కృతిక సమానత్వం లభిస్తుంది. చేయకలిగినవానికి చేయకలిగినంత పని, తిన కలిగినవానికి తినకలిగినంత తిండి లభించటం స్వేచ్ఛాస్వాతంత్ర్యానికి నాంది. అయితే భౌతిక స్వరూపాలు, స్వరూపస్వభావాలు, వివేకం, విజ్ఞానం, వికాసాలు ఆధారంగా ఎవరివ్యత్యాసాలు వారికి వుంటవి. ఆర్థిక వ్యత్యాసాలు ఈవిధంగా పెరుగుతవి, ఈ వ్యత్యాసాన్ని సరి చేయుటకు పూనుకున్నా జాతిపతనం తప్పదు. జాతిబాధ్యతారహిత మౌతుంది.

రాజ్యాంగ అవుసరాన్ని గుర్తించేటప్పుడు ప్రజలు ప్రజారాజ్యా నికి రాజులు, రాజ్యాంగ సూత్రాలు అన్నీ ప్రజలకు జవాబుదారిగా రాజ్యాంగం రూపొందాలి, ప్రజలు సమిష్టిబాధ్యత వహించి ప్రాతి నిధ్యాన్ని ఎన్నికచేయాలి, ప్రజలు ఓటుద్వారా ప్రాతినిధ్యాన్ని ఎన్నికచేయాలి, ప్రజలు పాలనాసేవలు తమ ఇండ్లకందుకొనువిధంగా ప్రాతినిధ్యాన్ని ఆదేశించాలి, ప్రజలు నిత్యకృత్యంలో తమవిధులు క్రమశిక్షణతో నిర్వర్తించాలి, ప్రజలు పాలితులుగా, ప్రభుత్వం పాలకులుగా గుర్తించి నడుచుకోవాలి. ప్రజలు క్రమంతప్పితే ప్రభుత్వం శిక్షిస్తుందనే విషయాన్ని ప్రజలుగుర్తించి నడుచుకోవాలి. కర్తవ్యనిర్వాహకులు ప్రజలని, కార్యసాధకులు ప్రభుత్వం అనిగుర్తించి నడుచుకోవాలి. ఉత్పత్తి దేశాభివృద్ధిరంగాలలో ప్రజలది, ప్రభుత్వా నిది సగభాగంగా గుర్తించునది నిజమైన సంపూర్ణప్రజాస్వామిక రాజ్యం. ప్రజల ఆదర్శం, ప్రభుత్వ దర్శకత్వం ప్రజాస్వామిక రాజ్యా నికి నిదర్శనం.

సంపూర్ణ ప్రజాస్వామిక రాజ్యానికి న్యాయవిధానంకూడా సంపూర్ణమైన న్యాయహక్కులు కలిగివుండాలి. న్యాయవ్యవస్థ ప్రజ లకు జవాబుదారీగా న్యాయార్థిని రక్షించటం, దుష్టుని శిక్షించటం. క్రమంతప్పకుండా న్యాయం అమలుజరిపే ప్రజాస్వామిక దేశం సురక్షి తంగా వుంటుంది. న్యాయం ధర్మం సత్యం అహింస తప్పకుండా అమలుజరుపు న్యాయవిధానం రూపొందించినపుడు వందకోట్లు జనమే కాదు వందలకోట్లుజనాన్ని ధర్మబద్ధంగా న్యాయబద్ధంగా సత్య అహింసలతో ప్రజాస్వామికపాలన కొనసాగించవచ్చు. నేరచరిత్రను చట్టపరిధులలో కాకుండా న్యాయపరిధిలో విచారణ జరిపి వ్యక్తి

చేసెడి తప్పుకు వాని హోదాకు తగిన శిక్షవిధిస్తే ప్రజాపాలన క్రమ శిక్షణ కలిగివుంటుంది. ప్రస్తుత హైకోర్టులు సుప్రీంకోర్టులు చట్టాల ప్రకారం తేల్చలేని న్యాయం అతిసామాన్యుడు చట్టాలతో పనిలేకుండా న్యాయానికి సరియైన నిర్వాచనం ఇవ్వగలడు. సంవత్సరాల తరబడి కోర్టులు తేల్చలేని న్యాయం గంటల సమయంలో తేల్చగలడు. సామాజిక మనుగడ, సామాజిక జీవనం, సామాజిక రక్షణ, సామాజిక విజ్ఞానం, సామాజిక ఆరోగ్యం సంరక్షణకు రాజ్యాంగం ఒక పరిశ్రమలో యంత్రాలలాగా ప్రజాతంత్రానికి మార్గం చూపించుటకు ప్రజలకు రాజ్యాంగం అవుసరమైనది. యంత్రలోపం అసలు మూల యంత్రాన్ని ఎలా బంధించివేస్తుందో పరిపాలనశాఖ పరయంత్ర లోపం పరిపాలన మూలకారణాలను చెడగొట్టుతుంది.

2. రాజ్యాంగ విధులు :

1. జాతీయ రాజ్యాంగ విధులు నిర్వహించుటకు జాతీయప్రజా రాజ్యమండలి.

2. జాతీయ ప్రజాతంత్ర విధులు నిర్వహించుటకు జాతీయ ప్రజా ప్రభుత్వ మండలి.

3. జాతీయ న్యాయరక్షణ విధులు నిర్వహించుటకు న్యాయ రక్షణ మండలి.

జాతీయతతో కూడుకొనిన మూడు విభాగాలు, రాష్ట్రస్థాయికి జిల్లాస్థాయికి గ్రామస్థాయికి విస్తరించి నాలుగు అంచెలలో

రాజ్యాంగ విధులు నిర్వహించి ప్రజాస్వామిక రాజ్యాంగ అంగాలు జాతికి న్యాయం చేకూరుస్తవి.

ఈ మూడు పాలనా అంగాలతో వ్యక్తిగత అభిప్రాయాలకు స్థానంలేదు. సమిష్టి బాధ్యతలతో ప్రతిరంగం పని నిర్వహిస్తుంది. మార్పు ఏదైనా అవుసరమైనపుడు మార్పు ప్రజలతీర్పును సూచిస్తుంది.

జాతీయ ప్రజారాజ్య మండలి విధులు :

1) దేశరక్షణ
2) విదేశ వ్యవహారాలు
3) జాతీయ ఉత్పత్తి నిర్ణయాలు
4) ఎగుమతి దిగుమతి వాణిజ్య నిర్ణయాలు
5) వనరులు సర్దుబాటు నిర్ణయాలు
6) సమాచార ప్రచార సాధనాలు
7) ప్రకృతి వైపరీత్యాల సహాయం
8) చట్ట సవరణలు

దేశపరిపాలన వడిదుడుకులకు లోనుకాకుండా జాతీయభద్రత జాతీయస్థాయి నుండి గ్రామస్థాయి వరకు నాలుగు అంచెలలో నెల కొల్పబడే ప్రజారాజ్య మండలులు, వాటి పరిధులలో అవి పనిచేసి, జాతికి సుస్థిరత చేకూర్చుతవి. జాతీయ బాధ్యత, జాతీయ భావం, జాతి క్షేమం జాతీయతతో రూపొందు నాలుగు అంచెలరాజ్యం.

1. దేశరక్షణ రాజకీయ అస్థిరతకు వినియోగించకుండా దేశరక్షణ. దేశరక్షణగా వినియోగించి శక్తివంతమైన రక్షణబలగాలు, రక్షణసామాగ్రి కలిగి సుశిక్షితులైన సైనిక బలగాలతో రక్షణ కవచాన్ని రూపొందించుటకు ప్రజారాజ్యమండలి పరిధికి చేర్చటం జరిగింది.

2. విదేశ వ్యవహారాలు దేశరక్షణకు, విదేశ వ్యవహారాలకు గల సంబంధం విడతీయరానిది. ఇరుగు పొరుగు దేశాలు వాటి స్నేహ సంబంధాలు జాతీయ విధానాలు ఒకదాని కొకటి బంధాలు. అగ్ర ఆధిపత్యం జాతీయమైనది అయినందున జాతీయ ప్రజారాజ్య మండలి పరిధికి చేర్చటం జరిగింది.

3. జాతీయంగా వనరులు మానవశక్తి ఆధారంగా ప్రజావసరాలు ఆధారంగా వనరులు సర్దుబాటుచేసి ఉత్పత్తి నిర్ణయాలు తీసుకొని ఏస్థాయివనరులు ఆస్థాయిలో వినియోగించు విధంగా పరిపాలనా సౌలభ్యాన్ని ప్రజలకు కల్పించి పాలన వికేంద్రీకరణ విధానాలు అమలుజరుపవలసివున్నది. రాష్ట్రస్థాయి ఉత్పత్తికోటాలు రాష్ట్రస్థాయికి జిల్లాస్థాయి ఉత్పత్తికోటా జిల్లాస్థాయికి గ్రామస్థాయి ఉత్పత్తికోటా, గ్రామస్థాయికి జాతీయంగా ఎవరిపరిధిలోవారు చర్యలు తీసుకొని జాతీయ ఉత్పత్తికి పోటీకల్పించి, జాతీయ ఉత్పత్తి ప్రతివ్యక్తి ప్రతిగ్రామం ప్రతిజిల్లా ప్రతిరాష్ట్రం బాధ్యతగా పరిపాలన వికేంద్రీకరణ అమలుజరుపువిధంగా జాతీయప్రజారాజ్యమండలి ఉత్పత్తి నిర్ణయాలు తీసుకోవలసివున్నది. ఉత్పత్తి పరిధిలో లైసెన్సువిధానాన్ని అమలు జరుపవలసివున్నది, ఉత్పత్తినిర్ణయంలోనే లైసెన్సులవిధానం ఇమిడివుంటవి.

4. ఎగుమతి దిగుమతి వాణిజ్యం నిర్ణయాలు విచ్చలవిడిగా ఎగుమతి దిగుమతులు అమలుజరుపకుండా అప్పులుచేసి ఆడంబరాలకు పోకుండా భూగర్భ సంపదలు ఎగుమతిచేయకుండా దేశ ప్రయోజనాలు ముందుతరాలకు ఉపయోగపడు విధంగా భూగర్భ సహజ సంపద దేశావసరాలకు వినియోగించుకొంటూ, విదేశాలకు ఎగుమతి నిషేధించాలి. వ్యక్తి స్వార్థంకంటే ప్రభుత్వస్వార్థం దేశాన్ని గుల్లచేస్తుంది. మాణిక్యాన్ని అమ్మి మట్టిమిగుల్చుతుంది. ఈ స్థితిని అరికట్టుటకు ఎగుమతి వ్యాపారాన్ని క్రమబద్ధచేసి, కృత్రిమ ప్రకృతివనరులు ఉత్పత్తులకు ఎగుమతి వ్యాపారాన్ని పెంపుచేయవలసివున్నది. ఖనిజ సంపదల ఎగుమతి నూటికి నూరుశాతం నిషేధించి స్థిరసంపదలు కలిగినదేశంగా భారతదేశానికి బిరుదు సంపాదించవలసివున్నది.

దేశోత్పత్తులు పెంచి దిగుమతి వాణిజ్యాన్ని తగ్గించవలసివున్నది. వస్తువు ఉత్పత్తి నాణ్యతతో విదేశవస్తువుల వ్యామోహం తగ్గించి, దేశావసరాలను కుదించి, అన్నం, వస్త్రం, త్రాగుటకు మంచి నీరు విద్యావైద్యం నివాసం మానవజీవనాధారాలకు ప్రాధాన్యత ఇచ్చి దిగుమతి విధానాలు క్రమబద్ధం చేయుటకు జాతీయవిధానం కల్పించబడింది. ఆడంబర వ్యయాన్ని స్వయం సమృద్ధిలో కల్పించుకోవచ్చు, దినదినానికి పెంచుకోవచ్చు కాని విదేశాల దిగుమతితో సంతృప్తిపడటం దేశానికి గౌరవంకాదు, దేశాన్ని అగౌరవపరిచే విధానం సహించరానిది స్వచ్ఛంద ఉత్పత్తులతో సంతృప్తిపడువిధానం ప్రతి ఆడంబరజీవి అలవర్చుకోవాలి, ఒకరికంటే మిన్నగా ఉత్పత్తికి పోటీపడి ఉత్పత్తిచేయటం పురుషలక్షణం, పురుషార్థాన్ని పెంపొందించుటకు పోటీపడితే జాతికి మేలుజరుగుతుంది. విదేశ వస్తువ్యామో

హాన్ని విదేశ ధనవ్యామోహాన్ని అరికట్టుటకు జాతీయ క్రమశిక్షణ విధానం అమలుజరుపబడుతుంది.

5. వనరులు సర్దుబాట్లు నిర్ణయాలు జాతీయంగా రాష్ట్రానికి, జిల్లాకు జిల్లాకు, గ్రామానికి గ్రామానికి వనరులు సర్దుబాటు విధానాలు అవలంభించినపుడే వనరులు మానవశక్తి వినియోగించి పనులు కల్పించి, నిరుద్యోగం దారిద్య్రంతొలగించు అవకాశంఏర్పడు తుంది. ఇలా చేయకుంటే వనరులు వున్నచోట మానవశక్తివుండదు. మానవశక్తి వున్నచోట వనరులు వుండవు. వనరులు మానవ శక్తి సర్దుబాటుద్వారా మంచి ఫలితాలు సాధించవచ్చు. ఐదు సంవత్సర ములు కాలవ్యవధిలో దరిద్రరేఖ దాటించి జాతీయన్యాయం సాధించ వచ్చు.

6. సమాచార ప్రచార సాధనాలు వాస్తవరూపంలో అవి ప్రచురణ చేయ కలిగితే దేశాభ్యుదయ సాధనకు అవి బాగా తోడ్పడు తవి. అభిమానం, ద్వేషం, క్రోధం, ఆవేశాలకు ప్రాధాన్యత ఇస్తే అవి దేశద్రోహిగా మారుతవి. కుల మతాలు ప్రేరేపిస్తే జాతీయతకు చిచ్చురగుల్చుతవి. సమాచార ప్రచారసాధనాలు వ్యక్తి ఆరాధనకు పూనుకుంటే దేశం శక్తిహీనమైపోతుంది. సమాచార ప్రచారసాధనాలు ప్రచురించే ప్రచురణలు నిజనిర్ధారణకు న్యాయవిచారణకు రుజువయ్యేవిగా వుండాలి. ఆదర్శ ప్రజారాజ్యంలో సమాచారప్రచారసాధనాల ప్రాముఖ్యత చాలా విస్తృతంగావుంటుంది. నిజనిర్ధారణకు ప్రచురణకర్తలు బాధ్యులుగా వుంటారు. వ్యాపారసరళి వుండదు. పరిపాలన ప్రజాభిప్రాయం న్యాయనిర్వహణ ప్రచురణలు ప్రాముఖ్యంగా వుంటవి. ఏవ్యక్తి తన విధినిర్వహణలో

బాధ్యత వుల్లంఘించినా, ఉదాశీనత వహించినా, నిర్లక్ష్యవైఖరి ప్రదర్శించినా సమాచారప్రచారసాధనాలు తమ ప్రచురణలో ప్రచురించవచ్చు. హోదాలతో నిమిత్తంలేకుండా అందరి ప్రవర్తనలు బహిరంగపర్చవచ్చు. ఇందుకు న్యాయవ్యవస్థ అతీతంకాదు. ప్రచారసాధకులు పట్టణాలలో రాజకీయ అధికారాలచుట్టూ ప్రదక్షిణలు చేయటంకాకుండా వనరులు మానవశక్తి వినియోగించుటకు ఉపయోగించాలి. మారుమూల గ్రామాల కష్టాలు, ప్రజల సహకార లోటు, పరిపాలన సహకారలోటు పాలకులదృష్టికి తీసుకురావాలి.

7. ప్రకృతి వైపరీత్యాల సహాయం, కరువులు, కాటకాలు, తుఫానులు, అతివృష్టి, వరదలు, అగ్నిసంభవించి నష్టపోయినా ప్రజలకు తక్షణసహాయం అందించి, యధాస్థితి జాతీయప్రజారాజ్యమండలి కల్పించాలి. వస్తుభీమాసౌకర్యం కల్పించి, కృత్రిమ విపరీతాలు సృష్టించి, జాతీయ ఉత్పత్తిని నష్టపర్చే భీమాసౌకర్యాలు రద్దుచేసి, జాతీయ ఆదాయం నష్టపోకుండాచూడాలి. ఉత్పత్తి,వాణిజ్యం,రవాణ అవలంభించేవారు వస్తుభద్రత, వారి బాధ్యతపైవుంటే ప్రతిసంవత్సరం కొన్నివేల కోట్లరూపాయలు జాతీయ ఆదాయం పెరుగుతుంది. జాతీయ ఆదాయం దుర్వినియోగం కాకుండా కాపాడటం ప్రతివ్యక్తి బాధ్యతగా జాతీయ శిక్షారక్షణ విధానం ప్రకృతి వైపరీత్యాలలో రూపొందాలి. వస్తువు భద్రత సంబంధిత వ్యక్తి కర్తవ్యంగా నిర్ధారించాలి.

8. చట్టసవరణలు జాతీయ ప్రజాప్రభుత్వమండలి దేశప్రజా పరిపాలన చట్టాలు రూపొందిస్తుంది. ప్రజాప్రభుత్వమండలి రూపొందించిన ప్రతిచట్టాన్ని జాతీయప్రజారాజ్యమండలి సమావేశంలో

పునఃపరిశీలనచేసి చట్టానికి తుదిరూపం ఇచ్చేటప్పుడు జాతికి ప్రయోజనకరంగా సరిదిద్దవలసివున్నది. జాతీయప్రజారాజ్యమండలి రాష్ట్రపతి బాధ్యతలతోబాటు ఎగువవిధాన నిర్ణయసభగా గుర్తింపు పొందుతుంది. దిగువసభ నిర్ణయపొరపాట్లు ఎగువసభ సరిచేస్తుంది, ఎగువ దిగువ సభలు మానవప్రవర్తన నియమావళి చక్కదిద్ది ప్రతివ్యక్తిని గాంధీవంటి ప్రముఖవ్యక్తిగా రూపుదిద్దు కార్యక్రమాలలో ఆదర్శ రాజ్యం రచన చేయబడుచున్నది. రాజ్యాంగ నిర్వచనానికి ఇంకా మెరుగులు దిద్దేవిధంగా చట్టనిర్మాణాలు రూపొందించాలి, విధులకు ప్రాధాన్యత ఇవ్వాలి. కాని వ్యక్తులకు ప్రాధాన్యత ఇవ్వకూడదు.

3. ప్రజాతంత్ర ప్రభుత్వ విధులు :

1) జాతీయపాలన నిర్మాణం
2) పాలన నిర్వహణ విధానం
3) కేంద్రపాలన
4) రాష్ట్రపాలన
5) జిల్లాపాలన
6) గ్రామపాలన
7) శాస్త్రీయ విజ్ఞానం

ఎవరు ఎంచుకున్న వృత్తులు ఉపాధులకు వారే బాధ్యులుగా జాతీయంగా ఉత్పత్తిపాలన బాధ్యతలు కల్పించవలసివున్నది.

1) జాతీయపాలన నిర్మాణం :

జాతీయంగా ప్రజలచేత ఎన్నికచేయబడిన జాతీయప్రజా ప్రభుత్వమండలి సభ్యులు సమావేశాలలో రూపొందించే చట్టాలు ఉత్పత్తి కారకాలు ప్రజలచేతులలో పారిశ్రామికవేత్తల చేతులలోను పాలన సరఫరాలు పాలన పర్యవేక్షణ ప్రభుత్వయంత్రాంగం చేతుల లోను వ్యక్తి ఆదాయం పెంపొందించి, జాతీయఆదాయం పెంచు కొను విధంగాను పాలన చట్టానికి రూపకల్పన చేయవలసివున్నది. పాలన నిర్మాణంలో ఎవరు ఏవృత్తి, ఉత్పత్తి చేపట్టినా వృత్తికి న్యాయం చేకూర్చటం వ్యక్తిధర్మంగా. వృత్తి ఉత్పత్తిపాలనధర్మాలు నిర్ధారించవలసివున్నది. ఆశావాదులు తన శక్తిసామర్థ్యాన్ని గుర్తించ కుండా వృత్తి ఉత్పత్తులు చేపట్టి, వృత్తికి ఉత్పత్తికి తగిన న్యాయం చేకూర్చలేకపోతే వాని ప్రవర్తన జాతీయనష్టంగా భావించి వాని వృత్తి ఉత్పత్తినుండి తొలిగించి వాని శక్తిసామర్థ్యానికి తగిన వృత్తి ఉత్పత్తి నియమించు విధంగా జాతీయపాలన చట్టాలు రూపొందించ వలసి వున్నది.

జాతీయ న్యాయం, జాతీయ ధర్మం, జాతీయ అవసరాలు, జాతీయ వినియోగం సమకూర్చటం ప్రభుత్వం ప్రధాన ధ్యేయంగా గుర్తించి, 1) విద్యవిజ్ఞానం 2) వైద్యం ఆరోగ్యం 3) నివాసం 4) పని వృత్తి కల్పించటం పౌరుని ప్రాథమిక హక్కుగా గుర్తించి, సామాజిక సాంస్కృతిక సమానత్వాన్ని సాధించటం నిజమైన ప్రజాస్వామ్య పాలన నెలకొల్పు చట్టాలు రూపొందించటం, దేశంలో నిరుద్యోగం, దరిద్రం, అమాయకం, అజ్ఞానం తొలిగించి నిరాశ్రయాన్ని రూపు

మాపి అందరికి నిర్బంధపనులు వృత్తులు కల్పించు చట్టాలు రూపొం దించటం, వనరులు మానవశక్తి సమన్వయపరచి అధికోత్పత్తులు సాధించు చట్టాలు రూపొందించవలసివున్నది.

ప్రజా ప్రాతినిధ్యానికి ప్రజలకు జవాబుదారిగా చిత్తశుద్ధి శ్రమించి పాలనసౌకర్యాలు ప్రజలఇండ్లకందించువిధంగా జవాబుదారి పాలనవిధానాలు చట్టరూపంలో కల్పించి, బాధ్యతలు హద్దులు నిర్ధారించి, అధికారాలు కల్పించటం ప్రాతినిధ్య బాధ్యతలు, నిర్వ హణలో నిరాకరించినా అతిక్రమించినా ఉదాశీనత వహించినా తక్షణం ప్రజాప్రాతినిధ్యం రద్దుచేయువిధంగా చట్టపాలన కల్పించటం ప్రజాప్రతినిధి ఆశ్రితపక్షపాతం, బంధుప్రీతి ఆర్థికస్వార్థంతో తప్పు చేస్తే తక్షణం శిక్షలు తప్పుకుతగినవిధంగా విధించుచట్టం రూపొం దించటం ప్రతిభ, బాధ్యత, దక్షత, నీతి, నిజాయితీ, విలువలు పరిర క్షణ, ప్రజాప్రాతినిధ్య లక్ష్యంగా చట్టం రూపొందించటం.

పాలన నిర్వహణ జాతీయంగా పదిమందికి మించకుండా కార్య నిర్వాహక కార్యవర్గాన్ని నియమించు విధంగా పాలన నిర్వాహక చట్టం రూపొందించటం ప్రకృతివైపరీత్యాలు సంభవించినచోటులు, భారీ ప్రాధాన్యతలు రూపొందుచోటులు మంత్రుల పర్యటనలుచేసి తగిన ప్రాధాన్యత కల్పించుటకుమాత్రమే ప్రజాప్రభుత్వ ధనం విని యోగించవలె, కాని పర్యటనలు నిత్యకృత్యంగా ప్రజాప్రభుత్వధనం దుర్వినియోగం చేయకుండా పాలన నిర్వహణచట్టాలు రూపొందిం చటం, పరిపాలన వికేంద్రీకరణ చేయటం వలన ఒక్కొక మంత్రికి శాఖాపరిపాలన నిర్వహణకు 48 మందితో పదిమంది మంత్రులకు 450 మంది సిబ్బందికి మించకుండా సెక్రటరియేట్ చట్టాలు రూపొం

దించటం జాతీయంగా నాలుగు అంచెలపాలన పరిధులలో ఉత్పత్తి కారకాలు జాతీయ ప్రజారాజ్యమండలి నిర్ణయించిన విధానాన్ని అనుసరించి, వనరులు మానవశక్తి ఆధారంగా ఉత్పత్తులు చేయు విధానాన్ని నాలుగు అంచెల పాలనకు కల్పించటం జాతీయలక్ష్యాన్ని అనుసరించి స్వేచ్ఛాస్వాతంత్ర్యపాలన నాలుగు అంచెలకు విభజించు చట్టం రూపొందించటం, ఉత్పత్తి నిర్ణయం, వస్తు నాణ్యత, వస్తు గ్యారంటి ఆయా పరిధులలో ప్రభుత్వనిధి బాధ్యతగా చట్టం రూపొం దించటం ప్రజాపాలన వడిదుడుకులకు గురికాకుండా శాంతిభద్రతలు సంరక్షించు బాధ్యత రాష్ట్రపరిధిలో రాష్ట్రానిది, జిల్లాపరిధిలో జిల్లాది, గ్రామపరిధిలో గ్రామానిది, అన్నిటికంటే గ్రామపాలన ప్రధానమైనదిగా గుర్తించి, గ్రామపరిధిలో పాలనయంత్రాంగం ప్రజాపాలనపై పట్టుకలిగి పనిచేయు అధికారం గ్రామప్రజారాజ్య మండలికి కల్పించటం, గ్రామప్రాతినిధ్యం తప్పుచేసిన తక్షణం తగిన శిక్ష గంటలకాలంలో విధించు చట్టం రూపొందిస్తే, ప్రజాస్వామిక పాలన దేశం శాంతి సౌభాగ్యాలు, సుఖ సంతోషాలతో శోభాయ మానంగా అభివృద్ధిచెందుతుంది. అసలుసమస్యలు ఉత్పన్నం కావు. సమస్యలకు అతీతంగా గ్రామపాలన రూపుదిద్దుకొంటుంది. అన్ని సమస్యలకు గ్రామం కారణం, అన్నిసమస్యల పరిష్కారానికి గ్రామ పాలన కారణమైనపుడు జిల్లా, రాష్ట్ర, కేంద్ర పాలనలకు పనివుం డదు, పర్యవేక్షణతప్ప గ్రామప్రజలను క్రమశిక్షణలో నడిపించి స్వేచ్ఛావాతావరణం కల్పించ కలిగింది. గ్రామపాలన గ్రామపాలకు లకు ఎవరిపరిధిలోవారు పాలన క్రమశిక్షణ అమలుజరుపు విధంగా గ్రామపాలనాధికారానికి బాధ్యత కల్పించు చట్టం రూపొందించటం

చట్టోల్లంఘనకు పాలుపడినవానిని తక్షణం కఠినశిక్షలు విధించు విధానంలో చట్టానికి రూపమివ్వవలసివున్నది.

1. జాతీయప్రజారాజ్యమండలి జాతీయ అవసరాలు నిర్ధారించి, విదేశవిధానాలు దేశరక్షణకు బాధ్యతవహిస్తుంది.

2. జాతీయప్రజాప్రభుత్వం ఉత్పత్తి సరఫరాలు సమకూర్చి ప్రజావసరాలు సమకూరుస్తుంది. ఇతర వ్యాపకాలు ఏవి ప్రజాప్రభుత్వానికి వుండవు.

3. జాతీయప్రజాన్యాయరక్షణమండలి ప్రజల న్యాయాన్ని పరిపాలన న్యాయాన్ని పరిరక్షిస్తుంది. క్రమశిక్షణ అమలు జరుపుతుంది.

3. కేంద్రపాలన :

1. కేంద్రప్రభుత్వానికి వుండవలసింది జాతీయ బాధ్యత పర్యవేక్షణ జాతీయ అవసరాలు సరఫరాలు ఉత్పత్తులు పర్యవేక్షణ వనరులు సర్దుబాటు పర్యవేక్షణ అంతర జాతీయ వాణిజ్యం రవాణాల పర్యవేక్షణ వాతావరణం శాస్త్రీయ పరిశోధనలు ఆర్థిక వనరుల పర్యవేక్షణ కేంద్రపరిధి జాతీయపాలన లక్ష్యంగా వుంచుకొను పాలనాశాఖలు పరిమితంగా భద్రపరిచేవిగా వుండాలి కాని విస్తృత పాలనశాఖలు కలిగి నిర్లక్ష్యానికి గురి అయేవిగా పరిపాలనాశాఖలు వుండకూడదు. జాతీయ అవుసరాల ప్రాతిపదికగా కేంద్రప్రభుత్వం పరిధికి వుండవలసిన పాలనశాఖలు.

1) జనరలు పరిపాలన పర్యవేక్షణ
2) ఆర్థికశాఖ
3) రైల్వేశాఖ
4) తంతితపాలాశాఖ
5) ఆహారనిల్వాలశాఖ
6) వాణిజ్యశాఖ
7) రవాణాశాఖ
8) విమానం సముద్రం రేవులుశాఖ
9) వాతావరణ శాస్త్రీయ పరిశోధనలు
10) ధరలు పన్నులు చార్జీల వేతనములు

జాతీయంగా ప్రజాప్రభుత్వమండలుల ప్రజల అవసరాలు ప్రభుత్వ అవసరాలు ఉత్పత్తులు సరఫరాలకు పరిమితిచేయబడింది.

1) ముద్రణ కర్మాగారాలు
2) రైల్వే కర్మాగారాలు
3) తంతితపాలా ఉత్పత్తులు
4) విమానాల తయారి
5) ఓడల నిర్మాణం

జాతీయంగా ఉత్పత్తి వాణిజ్య రవాణారంగాలలో దినదినాభివృద్ధి సాధించటం ధరలు పన్నులు చార్జీలు వేతనములు సమన్వాయపర్చి సామాన్యుని కొనుగోలు శక్తికి స్థిరత్వం కల్పించటం ప్రజాప్రభుత్వమండలుల కర్తవ్యం.

2. రాష్ట్రాల పాలన బాధ్యతలు :

జాతీయపాలనావిధానాలు నిర్ణయాలు అనుసరించి రాష్ట్రానికి పాలనాధికారాలు ఎంతవరకు అవుసరమో అంతవరకు రాష్ట్రపరిధికి వుంచుకొని మిగిలిన అధికారాలు జిల్లాలు నిర్వహించు విధంగా జిల్లాలకు అధికారాలు బదిలీచేయాలి. రాష్ట్రపరిధిలో రాష్ట్రపాలన అధికారాలు మచ్చలేని విధంగా సమర్థంగా అమలుజరపాలి, పరిమితి అధికారాలు పరిష్టంగా అమలుజరుపు అవుకాశం వుంటుంది కాని అపరిమిత అధికారాలు పరిష్టపాలన ప్రజాస్వామికంగా అమలుజరుగవు. ఈ వాస్తవాన్ని తెలుసుకొని రాష్ట్రపాలనకు కావలసిన పరిమితి శాఖలు నిర్ధారించి ఈ దిగువ చూపించటం జరుగుచున్నది.

1) వనరులు, పాలన, పర్యవేక్షణ శాఖ
2) ఆర్థికశాఖ
3) విజ్ఞాన వికేంద్రీకరణ శాఖ
4) శాస్త్రీయవిద్య పరిశోధనశాఖ
5) భారీ నీటిపారుదలలశాఖ
6) భారీపరిశ్రమలు ప్రాజెక్టులుశాఖ
7) భారీగనులు ఇంధనములుశాఖ
8) వాణిజ్యం రోడ్లు రవాణాశాఖ
9) పౌర సరఫరాలు నిల్వలుశాఖ
10) విద్యుత్ శక్తి శాఖ

ఈ పరిపాలనా శాఖలు రాష్ట్ర ప్రజానీకానికి కావలసిన సరఫరాలు సమకూర్చుటకు సరిపోతవి. జాతీయంగా ఏర్పడే ప్రజా ప్రభుత్వ పాలన శాఖలు అన్నీ ఉత్పత్తి సరఫరాలకు పరిమితి చేయబడింది.

1. ముఖ్యమంత్రిగా బాధ్యతలు చేపట్టువానికి రాష్ట్రీయంగా పరిపాలన పర్యవేక్షణ బాధ్యతలు తీసుకొని పరిపాలన పటిష్టపర్చు బాధ్యత కలిగివుండాలి కాని పాలనశాఖకు అంకితం కాకూడదు. నాయకుడుగా రాష్ట్రపాలన బాధ్యతలన్నిటికి జవాబుదారిగా పాలన పర్యవేక్షణచేసి ప్రజలను సంతృప్తిపర్చు పరిపాలన అందించాలి.

2. ఆర్థికమంత్రి రాష్ట్రవ్యాపితంగా పన్నులు వసూలు కార్యక్రమాలు, ధనం కేటాయింపు కార్యక్రమాలు, ఋణసౌకర్యాలు అందించు కార్యక్రమాలు, ఋణ వసూలు కార్యక్రమాలు, వృత్తులు చేపట్టు వ్యక్తులు ఆర్థికసంస్థలచుట్టూ తిరగకుండా, ఆర్థికసంస్థలు వ్యక్తులచుట్టూతిరిగి వనరులు వినియోగించి మానవశక్తికి పని కల్పించు పాలన కార్యక్రమం ఆర్థికశాఖ నిర్వహించాలి.

3. విజ్ఞానవికేంద్రీకరణశాఖ రాష్ట్రపరిధిలో జనాభా లెక్కల ప్రకారం 5000/- వేల జనాభాను ఒక యూనిట్‌గా తీసుకొని ప్రతి వ్యక్తికి విద్య, వైద్యం, ప్రతి పశువుకు పశువైద్యం, వ్యవసాయం పని కల్పించు పాలన సాంకేతిక విజ్ఞానం ప్రతివ్యక్తికి ప్రతివృత్తికి అందించి గృహం ఒక పరిశ్రమగా, హృదయం ఒక ప్రయోగశాలగా రాష్ట్ర ప్రజలను తీర్చిదిద్దు బాధ్యతతో పాలనావిధులు నిర్వర్తించవలసి వున్నది. దీనికి అనుగుణంగా గ్రామపాలనలో భారీ ఆర్థిక కార్యక్రమంతో పాలన కార్యక్రమం రూపొందుతుంది.

4. శాస్త్రీయ విద్య పరిశోధన పాలనశాఖ విద్యార్థి దశ 22 సంవత్సరం నుండి 24 సంవత్సరం వరకు పరిశోధన విద్య, శాస్త్రీయ పరిశోధనలు, రాష్ట్రస్థాయి పాలన ఆధీనంలో కొనసాగుతవి. పరిశోధన విద్య మూడు సంవత్సరములు. రాష్ట్రప్రభుత్వాలు నిర్వహించే విద్యా సంస్థలు, పరిశోధన సంస్థలు, రాష్ట్రమంత్రిపాలన పర్యవేక్షణక్రింద ఏర్పడి శాస్త్రీయ పరిశోధన, శాస్త్రీయ విద్య జాతిని అత్యోన్నత స్థాయికి చేరుస్తుంది.

5. భారీనీటిపారుదల పాలనశాఖ రాష్ట్రపరిధిలో అంతర రాష్ట్ర సంబంధాలతో నీటిపారుదలలు విరివిగా పెంపొందించి జాతీయ లక్ష్యంలో ప్రకృతి ప్రసాదించే వనరులు వృధాపోకుండా దేశానికి వినియోగించవలసివున్నది. భూగర్భ జల వనరులు పెంపొందించుటకు జాతీయ జల వనరులు వినియోగించు జాతీయప్రభుత్వం నిర్ణయ ఆధారంగా అంతర రాష్ట్ర ఒప్పందాన్ని సంబంధిత రాష్ట్రాలు కుదుర్చుకొని జల వనరులు వినియోగించుటకు మంత్రిత్వశాఖ పని చేయవలసివున్నది.

6. భారీపరిశ్రమలు ప్రాజెక్టులు నిర్వహణపాలనశాఖ రాష్ట్ర పరిధిలో వనరుల ఆధారంగా నెలకొల్పబడె భారీపరిశ్రమలు ప్రాజె క్టులు అవి ప్రభుత్వ ఆధీనంలో నెలకొల్పినను, ప్రయివేటు ఆధీనంలో నెలకొల్పినను లాభనష్టాలతో కూడిన కార్మిక భాగస్వామ్యం విధిగా కల్పించవలెను. 70% శాతం లాభనష్టాలు కార్మికులవిగా 30/ శాతం లాభనష్టాలు యాజమాన్యానివిగా పారిశ్రామిక భాగస్వామ్యం కల్పించి బాధ్యతాయుత పారిశ్రామిక విధానాన్ని రూపొందించవలసి

వున్నది. అధికోత్పత్తి సాధించుటకు వస్తునాణ్యత పెంపొందించుటకు భాగస్వామ్యవిధానం బాగా తోడ్పడుతుంది.

7. భారీ గనులు, ఇంధనములు, పాలనశాఖ రాష్ట్రపరిధిలో జాతీయ అవుసరాలకు అనుగుణంగా గనులు, ఇంధన, ఉత్పత్తులు నిర్వహించవలసివున్నది. స్థిరసంపదలు పరిమితిగా వాడుకొనుచూ, ఇతరదేశాలకు ఎగుమతులు నిషేధించి, భూగర్భసంపదలు ముందు తరాలకు మిగుల్చు విధానాన్ని ప్రభుత్వం అవలంభించవలసివున్నది. ఆడంబరవాడకాన్ని పరిమితిచేసి దిగుమతివిధానానికి స్వస్థిచెప్పవలసి వున్నది. దేశంలో కృత్రిమ ఆయిలు వనరులు పెంపొందించుకొని దేశాన్ని స్వయం సమృద్ధిదిశలో నడిపించవలసివున్నది.

8. వాణిజ్యం, రోడ్లు, రవాణా పాలనశాఖ, రాష్ట్రాల పరిధి ఉత్పత్తులు జాతీయ అవుసరాలకు అనుగుణంగా రవాణాచేయుటకు అవుసరాల ప్రాతిపతికగా, ఇతరరాష్ట్రాలనుండి తెచ్చుకొనుటకు రోడ్ల మరమత్తులు, రవాణాసదుపాయములు, జాతీయ అవుసరాల కనుగుణంగా వాణిజ్య రవాణామార్గాలు పటిష్టపర్చవలసివున్నది. గ్రామ స్థాయినుండి జాతీయస్థాయివరకు సరఫరాలు రాష్ట్రప్రభుత్వాలపై ఆదారపడివుంటుంది. అంతర జాతీయ వాణిజ్యం, రవాణాలు కేంద్ర ప్రభుత్వం నిర్వహిస్తుంది. ధరలకు కేంద్రం స్థిరత్వం కల్పిస్తుంది.

9. పౌరసరఫరాలు నిల్వాలపాలనశాఖ రాష్ట్రపరిధిలో అవసరాలు రాష్ట్రపరిధిలో నిల్వావుంచుకొని రాష్ట్రప్రజల అవుసరాలకు మించిన ప్రతి వస్తువును కేంద్రనిల్వాలకు పంపిస్తూ, రాష్ట్రవాడకానికి చాలని పరిస్థితిలో కేంద్రనిల్వాల నుండి తెప్పించుకొనుచూ, రాష్ట్ర

ప్రజలు సంతృప్తిగా జీవనం కొనసాగించు మార్గానికి పౌరసరఫరాలు మంత్రిత్వపాలనశాఖ పనిచేయవలసివున్నది.

**10.** విద్యుత్ సరఫరాపాలనశాఖ రాష్ట్రపరిధిలో ప్రజలు పరిశ్రమలు వ్యవసాయం అవుసరాలకు ప్రభుత్వం శక్తికిమించిన విద్యుత్పత్తి కొరతతీర్చుటకు పారిశ్రామిక వేత్తలకు స్వచ్ఛంద విద్యుత్ ఉత్పత్తి విధానం కల్పించి విద్యుత్ శక్తిని కొదువలేకుండా ప్రజలకు వ్యవసాయానికి ప్రభుత్వం అందించవలసివున్నది.

3. న్యాయ రక్షణమండలి విధులు :

జాతీయ ప్రజారాజ్యమండలి న్యాయదక్షత కలిగిన 15 మంది న్యాయనిపుణులను ఏరి న్యాయరక్షణమండలిని నియమిస్తుంది. నియమించిన న్యాయరక్షణ మండలికి సత్యం, శీలం, న్యాయం, ధర్మం విలువలు పరిరక్షణ అధికారం కల్పిస్తుంది, తరతర భేధం లేకుండా తప్పుచేసిన ప్రతి వ్యక్తిని శిక్షించు అధికారం కల్పిస్తుంది, న్యాయం అమలుజరుపుటకు కావలసిన పాలనశాఖలు, న్యాయరక్షణ మండలి పరిధికి కల్పిస్తుంది, న్యాయరక్షణమండలికి కల్పించు పాలనశాఖలు.

1) పాలన పర్యవేక్షణ

2) హోంశాఖ

3) ఎన్నికలు

4) అభివృద్ధి ఆడిట్

5) క్రమశిక్షణ

జాతీయంగా న్యాయయంత్రాంగం ప్రజల మధ్య తిరుగుచూ నేరచరితులను సామాజిక ధర్మాలకు విరుద్ధంగా తిరిగేవారిని వారి జీవనవిధానాన్ని పసిగట్టి ప్రశ్నిస్తుంది. వృత్తిధర్మాన్ని నిర్వర్తించు విధంగా ఆదేశిస్తుంది, నాలుగు అంచెల రాజ్యాంగంలో, నాలుగు అంచెల న్యాయ యంత్రాంగం వారివారి పరిధిలో ప్రజలకు జవాబు దారిగా పనిచేస్తుంది.

రాజ్యాంగం రాజరికమైన ప్రజాస్వామికమైన దుష్టశిక్షణ శిష్ట రక్షణ. రాజ్యాంగం నిర్వర్తించనపుడు హింససహజం, పౌరధర్మాలు పౌరహక్కులు ఉల్లంఘన జరగటం సహజమే. పౌరహక్కుల రక్షణ కోసం పౌరహక్కులసంఘాలుఏర్పడి హక్కులకోసం పోరాటాలుజరుగు తుంటవి. రాజ్యాంగం ధర్మరాజ్యాం నిర్వర్తించి ప్రజలకు న్యాయం అందించినపుడు పౌరహక్కుల సంఘాలు ఏర్పాటు అవసరం వుండదు. రాజ్యాంగపరిధిలో విధించే శిక్ష తప్పు ఆధారంగా వుంటుంది. న్యాయ అతిక్రమణలో నేర ఆధారంగా మరణశిక్ష విధించటం న్యాయ సమ్మతమే కాని న్యాయవిరుద్ధంకాదు, సామాజిక వ్యవస్థలో హింసా విధానం మంచిదికాదు కాని, రాజ్యాంగపరిధిలో మరణ శిక్షలవలన దేశం అన్ని విధములుగా విలువలు కలిగివుంటుంది. ప్రజాస్వామిక ప్రభుత్వం క్రమశిక్షణ కట్టుబాటు కలిగి రాజ్యాంగం పనిచేసినపుడు దుష్టశిక్షణ శిష్టరక్షణ అమలుపర్చినపుడు దేశంలో ధర్మం నిలు స్తుంది. ధర్మరక్షణ, న్యాయరక్షణ, న్యాయరక్షణమండలి విధి న్యాయరక్షణలో ఏలోపం జరిగినా ప్రజలు న్యాయరక్షణమండలిని

నిలదీసి అడిగే హక్కు ప్రజలకు ఉంటుంది, న్యాయరక్షణకు కావలసిన సర్వాధికారాలు న్యాయరక్షణమండలికి వుంటవి.

1) జాతీయన్యాయరక్షణమండలి

2) రాష్ట్రన్యాయరక్షణమండలి

3) జిల్లాన్యాయరక్షణమండలి

4) గ్రామన్యాయరక్షణమండలి

జాతీయంగా నాలుగు అంచలలో ఏస్థాయికాస్థాయి న్యాయం అమలుజరుపువిధానం రూపొందించబడుచున్నది. న్యాయం సర్వాంతర్యామిగా పనిచేయుటకు న్యాయ కార్యక్రమం రూపొందించబడుచున్నది.

1. జాతీయస్థాయిలో 15 మంది న్యాయనిపుణులతో ఏర్పరచబడిన న్యాయరక్షణమండలి న్యాయనిర్ణయాలు అమలుజరుపుటకు ఒక నియమావళిని రూపొందించి జాతీయంగా అమలు జరుపుతుంది. వ్యక్తిప్రవర్తననియమావళి, వృత్తిప్రవర్తన నియమావళి నిర్ధారించి న్యాయపర్యవేక్షణ అమలు జరుపుతుంది. వృత్తిధర్మాన్ని అతిక్రమించేవారు ఎంతటి హోదా కలిగినవారైనా శిక్షించు విధానం రూపొందిస్తుంది. సత్యం శీలం న్యాయం ధర్మం విలువలు పరిరక్షణ న్యాయరక్షణమండలి విధులు.

2. జాతీయ న్యాయరక్షణ మండలి రాష్ట్రాల పరిధిలో న్యాయం అమలుజరుపుటకు సుప్రసిద్ధులైన న్యాయనిపుణులను 15

మందిని ఏరి రాష్ట్రంలో న్యాయరక్షణమండలిని నియమిస్తుంది. జాతీయ న్యాయరక్షణమండలిచే రూపొందించబడిన న్యాయవిధానాలు 15 మంది న్యాయమూర్తులు రాష్ట్రంలో న్యాయాన్ని అమలు పరుస్తారు. జిల్లాపరిధిలో జిల్లాలలో న్యాయరక్షణ అమలుజరుపుటకు జిల్లాకు 15 మంది సుప్రసిద్ధులైన న్యాయనిపుణులును ఏరి జిల్లా న్యాయ రక్షణ మండలిని రూపొందిస్తారు

3. రాష్ట్రి న్యాయరక్షణ మండలిచే నియామకంచేయబడిన జిల్లా న్యాయ రక్షణమండలి జిల్లాలో న్యాయబాధ్యతలు చేపట్టి గ్రామపరిధిలో న్యాయం అమలుజరుపుటకు ప్రతిగ్రామంలోను న్యాయనిర్ణేతలను ఐదుగురు చొప్పున మంచిగుణం కలవారిని గ్రామ న్యాయరక్షణ మండలిగా నియామకంచేసి గ్రామంలో న్యాయ రక్షణ బాధ్యతలు గ్రామ న్యాయరక్షణ మండలికి కల్పించి జిల్లా న్యాయరక్షణ మండలి. 15 మంది 5 దుగురేసి చొప్పున 3 సంచార న్యాయదళాలుగా ఏర్పడి జిల్లా అంతట సంచారంచేయుచూ మూడు నెలలకు ఒకసారి గ్రామన్యాయరక్షణమండలి ఇచ్చేతీర్పులు పరిశీలించి అన్యాయం జరిగినట్లు పరిశీలనలో బుజువైనా, అన్యాయం జరిగిందని ఎవరైనా పిర్యాదుచేసినా తిరిగి విచారించి, న్యాయార్తికి న్యాయం కల్పించి, న్యాయాన్ని వక్రీకరించి తీర్పుఇచ్చిన గ్రామ న్యాయరక్షణ మండలిని శిక్షిస్తుంది.

జిల్లాసంచారన్యాయదళాలు సంచారంచేయునపుడు రహదారులలో రవాణాలో వాణిజ్యంలో జరిగే అవినీతి, కల్తి, దొంగవ్యాపారాలు, దారిదోపిడీలు, నేరాలకు పాలుపడేవారు, ఎవరుచిక్కినా

చిక్కిన స్థలంలో నేరాన్ని విచారించి శిక్షిస్తుంది. శిక్షలు : 1) నిర్బంధ కార్మికుడుగా కారాగారశిక్ష, 2) జరిమానాతో నిర్బంధ కార్మికుడుగా కారాగారశిక్ష, 3) ఆస్థి స్వాధీనంతో నిర్బంధ కార్మికుడుగా కారాగారశిక్ష, 4) యావజ్జీవ నిర్బంధ కార్మికుడుగా కారాగారశిక్ష, 5) జాతిద్రోహులకు, దేశద్రోహులకు, కూనీకోరులకు, కల్తీ చేసెడివారికి మరణశిక్షలు విధించి నేరచరిత్రను రూపుమాపి, మానవుని కర్తవ్యనిర్వహణునిగా చేయుటకు శిక్షలవిధానం తోడ్పడుతుంది.

4. జిల్లాన్యాయరక్షణమండలిచే నియామకం చేయుబడిన గ్రామన్యాయరక్షణమండలి గ్రామంలో న్యాయం అమలుపరుస్తుంది. గ్రామన్యాయరక్షణమండలి న్యాయనిర్ణయంచేయలేని వ్యవహారాలు జిల్లా న్యాయరక్షణమండలికి నివేదిస్తుంది. పట్టణ, నగరాలలో భారీ జనసంఖ్య వున్నందున పట్టణ నగర వార్డులవారిగా న్యాయరక్షణ మండలులు గ్రామ తరహాలో నియామికం జరుగుతుంది, న్యాయార్తిని కష్టనష్టాలపాలుచేయకుండా, గ్రామంలో లభించు న్యాయం నూటికి నూరుశాతం వాస్తవంలో లభిస్తుంది.

ప్రజలవద్దకు న్యాయం, ప్రజలచుట్టూతిరుగు న్యాయం ప్రజలకు జవాబుదారి న్యాయం కాగితాలుఖర్చులేని న్యాయం, అప్పీళ్ళు కాగితాలతో లభించు న్యాయం. ఇంతకంటె మరొకవిధంగా న్యాయం లభించు అవకాశంలేదు, వృత్తికి ఉత్పత్తికి తగిన న్యాయం గ్రామంలో తక్షణం లభించున్యాయంవలన రాజ్యం మానవశక్తిని ఉపయోగించుకొంటుంది. ప్రతి వ్యక్తి వృత్తిధర్మంలో నిమగ్నమై కర్తవ్యాన్ని నిర్వర్తించాలి. తన వృత్తిధర్మాన్ని తానే రుజువుచేసుకో

వాలి, సత్ ప్రవర్తనలో జాతి ఉత్తమ సాంప్రదాయాన్ని నెలకొల్పాలి, నిరుద్యోగం దారిద్ర్యము, నిరక్షరాస్యత బిక్షాటనం తొలగించుటకు న్యాయరక్షణ మండలి పర్యవేక్షణ సత్ ఫలితాలు తక్షణం సాధిస్తుంది. సామాజిక న్యాయం అమలుపరచటం న్యాయరక్షణమండలి బాధ్యతగా అధికారం కల్పించటం జాతికి సంపూర్ణన్యాయం అందుతుంది.

1. పరిపాలనపై పర్యవేక్షణ ప్రజాప్రతినిధిగా ఎన్నికయిన వారు పాలనసేవలు ప్రజల ఇండ్లకందించటంలో విఫలమైతే ప్రాతినిధ్యాన్ని తక్షణం తొలగించి, తిరిగి ఎన్నిక జరుపుతుంది. పాలన యంత్రాంగం వృత్తికి న్యాయం సమకూర్చలేకపోతే, తక్షణం తొలగించి ఆ యా ప్రభుత్వానికి తెలియజేస్తుంది. ప్రజలకు పాలనసేవలు అందించటమే ప్రజాప్రాతినిధ్య బాధ్యతగా పరిపాలన యంత్రాంగం బాధ్యతగా ప్రభుత్వ విధానాలు నిర్ధారించి ప్రజలకు న్యాయం సమకూరుస్తుంది.

2. ప్రజాన్యాయాన్ని సంరక్షించుటకు న్యాయచర్యలు తక్షణం అమలుజరుపుటకు పోలీసుశాఖను న్యాయరక్షణమండలి పరిధికి చేర్చటం జరిగింది, న్యాయరాజ్యపాలనలో పోలీసుశాఖ పని తీరు న్యాయరక్షణమండలి ఆదేశానుసారంగా అది పనిచేయవలసి వున్నది. పోలీసు వుద్యోగి పొరపాటుగా వారి స్వంతవిధానాలు అమలుజరిపితే తక్షణం శిక్షించబడును. పోలీసువారు ఏదిచేసినా గ్రామపరిధిలో గ్రామ న్యాయరక్షణ మండలి ఆదేశంప్రకారం జిల్లా న్యాయరక్షణ మండలి ఆదేశం ప్రకారం పోలీసులు పనిచేయాలి. పోలీసులు తప్పుచేస్తే ఆ తప్పుకు జవాబుదారులుగా గ్రామ న్యాయరక్షణమండలి ప్రజలకు జవాబుదారిగా తగిన పరిహారం చెల్లించాలి.

ప్రజలకు న్యాయం కల్పించుటకు ఏర్పరచిన గ్రామన్యాయరక్షణ మండలి ఏ ఒక్కరికి అన్యాయం జరుగకుండా చూడటమే తమ బాధ్యతగా గ్రామన్యాయరక్షణమండలి పనిచేయాలి.

3. జాతీయంగా న్యాయరక్షణమండలి, ప్రతి ఐదు సంవత్సరములకు ఒకసారి గ్రామస్థాయి నుండి జాతీయస్థాయి వరకు ఎన్నికలు జరుపుతుంది. రాజ్యాంగ చట్టప్రకారం రాజ్యాంగ సభల నిర్మాణం సభాసభ్యులను ఎన్నుకొను విధానం జాతీయంగా నాలుగు అంచెల రాజ్యాంగ నిర్మాణం, నాలుగు అంచెలలో రాజ్యాంగమండలి సభ్యులను ప్రజలు ఎన్నుకొను విధానం మూడు అంచెలలో జాతీయ ఎన్నికలు ముగించు ఎన్నికల విధానం ఎన్నికల కార్యక్రమంలో రూపొందించి, ఎన్నికలు ప్రకటించి ప్రభుత్వం ప్రచారసాధనాలు ఎన్నికలలో వినియోగించుకొని ప్రజలను ఎన్నికలకు ఆయత్తంచేసి మూడేమూడు రోజులు ఎన్నికలకు కేటాయించి, ఎన్నికలు జరిపిస్తుంది ఎవరికి ఖర్చు కష్టం నష్టం లేని ఎన్నికల విధానాన్ని రూపొందిస్తుంది. ఎన్నికలు జరిపిస్తుంది, ఈ ఎన్నికలవిధానంలో ప్రజాప్రాతినిధ్యం అన్న స్థాయిలకు ప్రజల ఓటుద్వారా ఎన్నిక కావలసివున్నది.

4. లెక్కల ఆడిట్ శాఖ జాతీయంగా వ్యక్తిగతంగా ఎంత పురోగమిస్తున్నది, సంస్థలు ఎంత పురోగమనంలో వున్నది, గ్రామాలు ఎంత పురోగమనంలో వున్నది, పట్టణాలు నగరాలు ఎంత పురోగమనంలో వున్నది లెక్కల ఆడిట్‌లో స్పష్టంగా నిర్ధారణ తేలుతుంది. పరిపాలకుల సహకార లోపము, ప్రజల బాధ్యతారాహిత్యము లోపం ఎవరిలోవున్నది నెలకు ఒకసారి లెక్కలఆడిట్ జరిపించుట ద్వారా పరిపాలకులను ప్రజలను జాగ్రత్తపర్చి వంచెనలేని సామాజిక

న్యాయం పాలన న్యాయం అమలుజరుపుటకు ఇంతకంటే మంచి పాలన విధానం కనుపించదు.

5. సామాజిక క్రమశిక్షణ ప్రజాస్వామిక పరిపాలనకు సామాజిక క్రమశిక్షణ ఆయువు. దేశ సౌభాగ్యం, దేశ స్వాతంత్ర్యం, భారత పౌరులు అందరిపై ఆధారపడివుంది. స్వేచ్ఛాస్వాతంత్ర్యం ఎంత సులువుగా వ్యక్తులకు ప్రజాస్వామిక ప్రభుత్వంలో లభిస్తుందో బాధ్యతలు అంతగా పెరుగుతవి, హద్దులు పెరుగుతవి, వ్యక్తుల బాధ్యతలు నిర్వహింపజేయుటకు హద్దులలో నడిపించుటకు ప్రతి వార్డులో వార్డు మెంబరు, అధ్యక్ష ఉపాధ్యక్షులు, ప్రతిగ్రామంలో ప్రజలు ఎన్నుకున్న ప్రజారాజ్యమండలి చేత సక్రమంగా పనిచేయిం చుటకు గ్రామంలో న్యాయరక్షణమండలిని నెలకొల్పటం జరుగు తుంది. ప్రజాప్రాతినిద్యం పాలన యంత్రాంగం వారి కర్తవ్యాలు వారు నిర్వర్తించి ప్రజలను బాధ్యతాయుతులుగా తీర్చిదిద్దటంలో సఫలీకృతులు కావాలి, న్యాయం సార్థకత్వం పొందాలి.

రాజకీయాలకు అతీతంగా నెలకొల్పిన జాతీయ న్యాయరక్షణ మండలి న్యాయానికి పరిమితంగా వుంటుంది కాని, పాలనబాధ్యతలు చేపట్టు అవకాశంలేదు. రాజ్యాంగ నిర్మాణ వ్యవస్థ, రాజ్యాంగ విధులు నిర్వహణకు పరిమితం. ప్రభుత్వం పాలనవ్యవస్థ, పాలనవిధులు నిర్వహణకే పరిమితం. ఎవరికి కేటాయించిన విధులకు వారు పరి మితం అయిన రాజ్యంలో అందరు సమిష్టిగా కర్తవ్యాలు నిర్వర్తించే రాజ్యంలో ఎటువంటి అవకతవకలు వడిదుడుకులు జరుగు అవకాశం లేదు. వ్యక్తుల అధికార అహంభావం పనిచేయదు, ప్రజాస్వామిక పరిపాలన స్థిరంగా సుస్థిరంగా వుండుటకు అన్నివిధానాలలో సమిష్టి

బాధ్యత కల్పించబడింది. వ్యక్తి ఇష్టం పనిచేయదు, అసలువ్యక్తి బాధ్యత పాలన రాజ్యాంగంలో రూపొందించుటలేదు.

ప్రజాస్వామిక ప్రభుత్వంలో రాజ్యాంగం ఏవిధంగా వుండవలెనో, రాజ్యాంగానికి రక్షణ ఏవిధంగా వుండవలెనో, రాజకీయ యంత్రాంగం, పాలన యంత్రాంగం, రాజ్యాంగపరిధిలో అధికారాలు ఏవిధంగా నిర్వర్తించవలెనో, ప్రజాస్వామిక ప్రభుత్వంలో ప్రజల బాధ్యత ఎంతవరకో ఎవరు బాధ్యతలు అతిక్రమించినా ఉదాశీనత వహించినా న్యాయరక్షణమండలి పాలన వ్యవస్థలను ప్రజలను అదుపులో వుంచగలదో ఆదర్శ ప్రజారాజ్యం ఎంత శక్తివంతంగా రూపొందిందో ఇంతవరకు తెలుసుకున్నాము. ఆదర్శ ప్రజారాజ్యం ఏ వ్యక్తిమీద, ఏశక్తిమీద ఆధారపడకుండా స్వశక్తిమీద దాని బలాన్ని అది నిరూపించుకొని ప్రజాస్వామ్యానికి స్థిర, సుస్థిరపాలన అందించు రచనా విధానమిది. ఈ ప్రజాస్వామిక రాజ్యాంగం ప్రపంచ ప్రజాస్వామిక దేశాలకు ఆదర్శంగా వుండు ఆదర్శ ప్రజారాజ్య రచన ఇది. ఇంతకుమించిన ప్రజాస్వామికపాలన 'నభూతో నభవిష్యతి' అను రీతిలో రచించబడుచున్నది.

ఇంతవరకు రాజ్యాంగ రూపురేఖలు కూర్పు చేయబడినవి కాని రాజ్యాంగపరిధిలో రాజకీయ యంత్రాలు, పాలనయంత్రాంగం, రాజ్యాంగ నిర్మాణ నిర్వహణలు, నాలుగు అంచెల రాజ్యాంగంలో రూపొందు విధానం ప్రజలు రాజులుగా రాజ్యాంగ యంత్రాగాన్ని రూపొందించు ఎన్నికల విధానం ప్రజలు తమ ప్రాతినిధ్యాన్ని ఎన్నికచేసి తమ ప్రతినిధిని రాజ్యాంగ సభలకు పంపించి పరిపాలన సేవలు ప్రజల ఇండ్లకందుకొనువిధానం ద్వితీయభాగంలోను, తృతీయ

చతుర్థ భాగ రచనలో వివరణలు ఇవ్వబడును. ప్రజల ప్రత్యక్ష ఓటు ద్వారా ఎన్నిక కాబడినవారితో నాలుగు అంచెలలో రాజ్యాంగాలు ఏర్పడుతవి. ఒకరిని తొలిగించే అధికారం ఇంకొకరికి కల్పించలేదు, నాలుగు అంచెలలో ఎవరికివారు ప్రజలకు జవాబుదారులు.

ద్వితీయభాగం :—

ఎన్నికలు నాలుగు అంచల రాజ్యంలో రాజ్యాంగ యంత్రాం గాన్ని ఎన్నుకొను విధానం.

1. ఎన్నికల కార్యక్రమం
2. గ్రామ ప్రజారాజ్యమండలి
3. జిల్లా ప్రజారాజ్యమండలి
4. రాష్ట్ర ప్రజారాజ్యమండలి
5. జాతీయ ప్రజారాజ్యమండలి

ఓటు ప్రాధాన్యత ప్రాతినిధ్యం పోటీప్రాధాన్యత ప్రాతిని ధ్యానికి ఎన్నికలలో స్థానంలేదు. వివేకం విజ్ఞానం సేవాభావం వృత్తికి న్యాయం చేయకలిగినవారికే ప్రజాప్రాతినిధ్యం కలుగుతుంది నిలు స్తుంది, అది లేనివారు పొరపాటుగా ఎన్నికయినా వానికివుండదు, ఆదర్శ ప్రజారాజ్య పరిపాలనకు త్యాగులు అర్హులుకాని భోగులు అర్హులుకారు.

ప్రజాస్వామ్యంలో ఓటరు బలహీనుడు కాకుండావున్నపుడే పరిపాలన విజయవంతంగా కొనసాగుతుంది. ఓటరు బలహీనుడైనపుడు గ్రామస్థాయినుండి జాతీయస్థాయివరకు అసమర్థత అన్యాయం జాతీయంగా పరిపాలనలో చోటుచేసుకొంటుంది. ఈనాడు [redacted] గ్రామపార్టీలు కోరుకొంటున్నది, ప్రాంతీయ జాతీయపార్టీలు కోరుకొంటున్నది. జాతీయపార్టీలు కోరుకొంటున్నది [redacted] రాజకీయ వ్యవస్థలు చెడ్డవనుకున్నపుడు రాజకీయవ్యవస్థను రాజ్యాంగమైనా సరిదిద్దాలి లేక ప్రజలైనాసరిదిద్దాలి, ఏదీలేకుండా పరిపాలన కొనసాగదు. [redacted] పరిపాలన ఏదేశానికి పనికిరాదు. స్థిరచిత్తం స్థిరనిర్ణయం ప్రజాస్వామిక పరిపాలనకు ఆధారం. స్థిరచిత్తాన్ని స్థిరనిర్ణయాన్నికల్పించటం ఆదర్శ ప్రజారాజ్య రచనలక్ష్యం. స్థిరచిత్తం స్థిరనిర్ణయం ప్రజాస్వామిక ఎన్నికల రూపకల్పనలోనే మొదలౌతుంది. ఎన్నికల నిర్ణయంలోనే స్థిరచిత్తానికి స్థిరనిర్ణయానికి పునాది పడుతుంది. ఒకసారి ఆదర్శ ప్రజారాజ్యం అమలులోకివస్తే మార్పు ఏదైనా ప్రజలచేతులలో వుంటుంది.

## 1. ఎన్నికల కార్యక్రమం :

జాతీయ న్యాయరక్షణమండలి పరిధిలో జరిగే ఎన్నికలు భారత సాంస్కృతిక సాంప్రదాయాన్ని అనుసరించి జాతీయంగా ఏర్పడిన రాజకీయవాదాలు : 1) అతివాదము 2) మితవాదము 3) సామ్యవాదము. ఈ మూడువాదముల ఆధారంగా ప్రజాప్రాతినిధ్యానికి జరిగే ప్రతి ఎన్నికకు ముగ్గురు అభ్యర్థులను ప్రజలే ఎన్నిక

చేసి పోటీకి నిలబెట్టటం ప్రజలు ఓటుచేసి ఎన్నుకోవటం ముందు స్థానిక ప్రజారాజ్యమండలి తదుపరి ప్రజాప్రభుత్వమండలి చివర జాతీయప్రజారాజ్యమండలి ఎన్నికలు పూర్తిచేయటం జరుగుతుంది. ఎన్నికలు జరుపునపుడు పోటీ అభ్యర్థుల ప్రమేయం ఏమివుండదు. ఎన్నికల నిర్వహణ బాధ్యత ప్రజలది, ఎన్నికలు జరిపించేది ఎన్నికల యంత్రాంగం స్థానికఎన్నికలలో బహుజన అభిప్రాయం పరిపాలనలో చోటు కల్పించుటకు త్రిసభ్యపోటీలో రెండవస్థానం ఓటువచ్చినవానికి నాలుగు అంచెలతో ప్రజారాజ్యమండలి ఎన్నికలలో ఉపాధ్యక్ష స్థానం కల్పించబడింది. ఉపాధ్యక్షుని అర్హతకు తగిన ఓటు రెండవ స్థానానికి రాని పక్షంలో నాలుగు అంచెల ప్రజారాజ్యమండలి మెజార్టి అభిప్రాయంప్రకారం ఉపాధ్యక్షుని ఎన్నుకోవటం జరుగుతుంది. అయితే నాలుగు అంచెలలో ప్రజారాజ్యమండలి ఎన్నికలకే ఈఎన్నిక విధానం వర్తింస్తుంది. కాని, ప్రజాప్రభుత్వమండలి ఎన్నికలకు ఈ ఎన్నికల విధానం వర్తించదు. ప్రజలుపోటి అభ్యర్థుల ఎన్నికచేయలేనిపక్షంలో జిల్లా ప్రజారాజ్యమండలి ఏర్పడిన తదుపరి కాళీస్థానాలలో పోటి అభ్యర్థులను ఎన్నికచేస్తుంది. ప్రజలు ఓటుతో ప్రాతినిధ్యాన్ని ఎన్నికచేయిస్తుంది.

గ్రామస్థాయిలో జిల్లాస్థాయిలో రెండుసభల విధానం ప్రజారాజ్యమండలి, ప్రజాప్రభుత్వమండలి మంచిదికాదని గ్రామస్థాయి ప్రభుత్వ పరిపాలనశాఖ జిల్లాస్థాయి ప్రభుత్వ పరిపాలనశాఖ ప్రజారాజ్యమండలిలో కలిపి వివాదాలు పొడచూపకుండా పటిష్ట పరిపాలన నెలకొల్పుట జరిగింది. రాష్ట్రప్రభుత్వమండలి సభాసభ్యులను జాతీయ

ప్రజాప్రభుత్వమండలి సభాసభ్యులను జిల్లాప్రజారాజ్యమండలి సభ్యులుగా నియమించి, నియోజకవర్గంలో పనిచేయుటకు అందుబాటుగా జిల్లాపాలన బాధ్యతలు పాలన అనుభవంతో చట్టాలు రూపొందించుటకు విధానమండలి బాధ్యతలు జాతీయంగా ప్రభుత్వప్రాతినిద్యానికి పరిపాలన నిర్మాణనిర్వహణ బాధ్యతలు పెంచబడినవి. ప్రజాప్రభుత్వ ప్రాతినిథ్యం గ్రామస్థాయినుండి జాతీయస్థాయివరకు బాధ్యతాయుతంగా పనిచేయవలసివుంటుంది. పరిపాలన సౌలభ్యంకోసం గ్రామస్థాయికి జిల్లాస్థాయికి ప్రజారాజ్యమండలి పరిపాలన ఖరారు చేయబడింది. ఎన్నికలు ప్రజారాజ్యమండలికి పరిమితిచేసి, ప్రజాప్రభుత్వమండలి ఎన్నికలకు రూపం ఇవ్వలేదు.

1) గ్రామ ప్రజారాజ్యమండలి ఎన్నికలు

2) జాతీయప్రజాప్రభుత్వమండలి ఎన్నికలు

3) జాతీయప్రజారాజ్యమండలి ఎన్నికలు

ఈ ఎన్నికల విధానం మూడు ఘట్టములుగా మూడురోజులలో జరుగుతవి. ఎన్నికలు మూడురోజులు ఎన్నుకొని ఫలితాలు తెలుసుకొనువిధానంలో ఎన్నికలు నిర్వహించబడుచున్నవి.

1) గ్రామ ప్రజారాజ్యమండలి ఎన్నికలు గ్రామసభల సమావేశ వివరములు, తేదీలు, స్థలము, సమయము ఎన్నికల యంత్రాంగం మూడుఘట్టముల ఎన్నికలకు ఎన్నికల కార్యక్రమం

ప్రకటించి, ప్రభుత్వప్రచారసాధనాలద్వారా ప్రజలను ఎన్నికలకు ఆయత్తంచేస్తుంది. ఎన్నికల కార్యక్రయాన్ని అనుసరించి ఎన్నికల యంత్రాగం గ్రామాలలో వార్డులవారి పోటీ అభ్యర్థులను మెజార్టి అభిప్రాయం ప్రకారం వార్డుకు ముగ్గురు పోటీదారులను ఎన్నికలకు సిద్ధంచేసి, తదుపరి గ్రామసభ జరిపి, గ్రామప్రజారాజ్యమండలి అధ్యక్ష వర్గాన్ని ఎన్నుకొనుటకు ముగ్గురు పోటీదారులను ఎన్నికచేసిన తదుపరి ఎన్నికల యంత్రాంగం పోటీదారుల పేరు, గుర్తు ఓటరుకు పరిచయంచేసి ఓటరును ఎన్నికలకు సిద్ధంచేసి, ఎన్నికలు జరిపించి, బూతులవారి లెక్కించి ఫలితాలు సాయంత్రానికి ప్రకటిస్తుంది. పోటీ అభ్యర్థి ఓటరుగా ఓటింగులో పాల్గొనటంతప్ప నోరువిప్పి మాట్లాడకూడదు. ఇతర ఓటరును సైగచేయకూడదు. అభ్యర్థి ప్రమేయం పరోక్షంగా కల్పించుకున్న పోటీకి అనర్హుతే కాకుండా శిక్షకు పాత్రుడౌతాడు.

2. పట్టణ, నగర ఎన్నికల విధానం గ్రామఎన్నికలవిధానాన్ని పోలివుంటుంది కాని, పట్టణ నగరప్రజలు ఒకచోట చేరి సభ జరిపి, అధ్యక్షవర్గాన్ని మెజార్టిద్వారా సూచించటం సాధ్యంగానిపని అయినందున పట్టణ నగర వార్డులకు పోటీ అభ్యర్థులుగా ప్రజలచేత నియామకం చేసిన వార్డుల పోటీ అభ్యర్థులు అందరు ఒకచోట సమావేశం జరిపి పట్టణ నగర అద్యక్షవర్గ పోటీకి ముగ్గురు అభ్యర్థులను నియామకం చేయవలసియున్నది. ఎన్నికల యంత్రాంగం అభ్యర్థులపేర్లు వారికి కేటాయించిన గుర్తులు ప్రభుత్వ ప్రచారసాధనాల ద్వారా ప్రచారంచేసి ఓటురును ఎన్నికలకు ఆయత్తంచేసి గ్రామా

లకు, పట్టణాలకు, నగరాలకు ఒకేరోజు ఎన్నికలు జరిపి, బూతులవారి లెక్కించి ఆరాత్రికే ఫలితాలు ప్రకటిస్తుంది.

2వ ఘట్టం : ఎన్నికలు మొదటి ఘట్టం ఎన్నికలలో ఎన్నికయిన గ్రామ ప్రజారాజ్యమండలి అధ్యక్ష ఉపాధ్యక్షులు పట్టణ నగర ప్రజారాజ్యమండలి అధ్యక్ష ఉపాధ్యక్షులు మరియు సభ్యులు రాష్ట్రప్రజాప్రభుత్వమండలి నియోజకవర్గాలలోని పైవారందరు ఒక చోట సమావేశం జరిపి, తమ నియోజకవర్గం నుండి ప్రజాప్రతినిధిని రాష్ట్రవిధానమండలికి పంపించుటకు ఎన్నికకు నిలబెట్టుటకు ముగ్గురు పోటీ అభ్యర్థులను మెజార్టీ అభిప్రాయంప్రకారం నియామకంచేసి జాతీయ ప్రజాప్రభుత్వమండలి నియోజకవర్గంవారీగా మరొక సమావేశం జరిపి జాతీయ ప్రజాప్రభుత్వమండలికి తమ ప్రతినిధిని పంపించుటకు పోటీకి ముగ్గురు అభ్యర్థులను మెజార్టి అభిప్రాయం ప్రకారం నియమించ వలసివున్నది. ఎన్నికలయంత్రాంగం పోటీ అభ్యర్థుల పేర్లు వారికి కేటాయించిన గుర్తులు ఎన్నుకొను విధానం ఎన్నికల కార్యక్రమం ప్రకారం ప్రచారంచేసి ప్రజలను ఎన్నికలకు ఆయత్తం చేసి ఎన్నికలు జరిపించి ఫలితాలు ప్రకటించి రెండవఘట్టం ఎన్నికలు పూర్తిచేస్తుంది.

3. 3వ ఘట్టం ఎన్నికలు జిల్లాల పరిధిలో రాష్ట్రప్రజాప్రభుత్వమండలి నియోజక వర్గాలలో ఎన్నికయిన ప్రజాప్రతినిధులు జాతీయ ప్రజాప్రభుత్వమండలి నియోజకవర్గాలలో ఎన్నికయిన ప్రజాప్రతినిధులు జిల్లాపరిధిలో సమావేశాలు జరిపి, జిల్లాప్రజారాజ్యమండలి అధ్యక్షువర్గ పోటీకి మెజార్టి అభిప్రాయం ప్రకారం ముగ్గురు అభ్యర్థులను పోటీకి ఎంపికచేసి తదుపరి-

2) రాష్ట్ర ప్రజాప్రభుత్వమండలి సభ్యులు రాష్ట్ర రాజధాను లలో సమావేశమై, రాష్ట్ర ప్రజారాజ్యమండలి, అధ్యక్షువర్గ పోటీకి ముగ్గురు అభ్యర్థులను మెజార్టీ ప్రకారం నియామకంచేస్తే,

3) జాతీయంగా ప్రజాప్రభుత్వ నియోజకవర్గాలలో ఎన్నికయిన జాతీయ ప్రజాప్రభుత్వమండలి సభ్యులు జాతీయ రాజధానిలో సమావేశమై జాతీయ ప్రజారాజ్యమండలి అధ్యక్షువర్గ ఎన్నికకు పోటీచేయు ముగ్గురు అభ్యర్థులను మెజార్టీ అభిప్రాయంప్రకారం నియామకంచేస్తుంది. జిల్లా రాష్ట్రం జాతీయ ప్రజారాజ్యమండలి ఎన్నికలు పోటీ అభ్యర్థులపేర్లు ఎన్నికగుర్తులు ఎన్నికల యంత్రాంగం ప్రభుత్వప్రచారసాధనాలద్వారా ప్రచారంచేసి ప్రజలను ఎన్నికలకు ఆయత్తంచేసి, ఎన్నికల కార్యక్రమంప్రకారం ఎన్నికలు జరిపించి ఫలితాలు ప్రకటించి మూడవ ఘట్టం ఎన్నికలు పూర్తిచేస్తుంది.

జిల్లా రాష్ట్రం జాతీయంగా ప్రజారాజ్యమండలి అధ్యక్షు వర్గ ఎన్నిక సాధారణ ఓటుద్వారా ఎన్నిక జరిపించవచ్చు, లేక గ్రామ ప్రజారాజ్యమండలి అధ్యక్ష ఉపాధ్యక్షులు, పట్టణనగర ప్రజారాజ్య మండలి అధ్యక్ష ఉపాధ్యక్షులు మరియు సభ్యులు ఓటుద్వారా ఎన్నిక జర్గిపించవచ్చు, ప్రభుత్వానికి ప్రజలకు వ్యయ ప్రయాసలు లేని ఎన్నికల విధానమిది, యుద్ధఫిరంగులు మోగుతున్నా ఎన్నికలు జరిగిపోవు ఎన్నికలవిధానమిది, చట్టసభలు రద్దుచేయకుండా కొత్త సభలు పునరుద్ధరించుపనిలేకుండా ప్రజలచే తిరస్కరింపబడినవారు దిగిపోవటం ప్రజల అభిమానం చూరగొన్నవారు పదవులలో కొనసాగు ఎన్నికల విధానమిది, నూటికి నూరుశాతం ప్రజాభిప్రాయ

పాలన ఎన్నికల విధానమిది, ప్రజలు రాజులుగా గుర్తింపుపొందు ఎన్నికల విధానమిది.

ఓటరు జాతీయంగాఎన్నికయి రాజ్యాంగయంత్రాన్ని ఎన్నిక చేయవచ్చు. 1) వార్డు ప్రాతినిధ్యానికి ఓటు, 2) గ్రామ ప్రాతినిధ్యానికి ఓటు, 3) రాష్ట్ర ప్రాతినిధ్యానికి ఓటు, 4) జాతీయప్రాతినిధ్యానికి ఓటు. ఈ నాలుగు ఓట్లకు పరిమితం కావచ్చు, లేక జాతీయంగా పరిధి విస్తరించివుండాలి అనుకుంటే జిల్లా రాష్ట్రజాతీయ ప్రజారాజ్యమండలి అధ్యక్షువర్గానికి ఓటుచేయవచ్చు. సాధారణ ఓటరు ఇష్టముపై ఆధారపడి ఎన్నికలు వుంటవి. ఎన్నికలు మూడు ఘట్టములలో పూర్తిచేయబడినవి. నాలుగు అంచలలో రాజ్యాంగాలు నిర్మాణం జరిగి పరిపాలనాబాధ్యతలు చేపట్టు పాలనావిధానాలు.

1. గ్రామరాజ్యం గ్రామపరిపాలన :

గ్రామపరిపాలన నిర్వహణకు వాస్తవ ఆధారాలతో నిర్మాణాత్మకమైన పరిపాలన అమలు జరుపుటకు గ్రామ ప్రజలు అభిప్రాయం ప్రకారం రాజ్యాంగసభను గ్రామస్థాయికి కల్పించటం జరిగింది. గ్రామంలో ప్రతివార్డు నుండి ప్రజలచే ఎన్నుకోబడిన ఒక ప్రజాప్రతినిధి ఆ ప్రజలకు పాలనా సేవలు అందించుటకు గ్రామసభలో పాలనా రూపకల్పన చేయును.

గ్రామ ప్రజారాజ్యమండలి అధ్యక్ష ఉపాధ్యక్షులు గ్రామ ప్రజలచే ఎన్నుకొనబడి గ్రామపాలనా బాధ్యతవహిస్తున్నందున గ్రామప్రజలకు జవాబుదారిగా పాలన సేవలు ప్రజల ఇండ్లకందించు

విధంగా గ్రామపరిపాలనాధికారాలు రాజ్యాంగరీత్యా గ్రామాలకు పట్టణాలకు, నగరాలకు సంక్రమించనున్నవి.

గ్రామప్రజారాజ్యమండలి గ్రామంలో వార్డులనుండి ఎన్నికయినవారు ప్రజారాజ్యమండలి సభ్యులుగాను, అధ్యక్షవర్గంగా ఎన్నికయినవారు గ్రామప్రజారాజ్యమండలి అధ్యక్షులుగాను గ్రామసభ నిర్మాణం జరిగి గ్రామపరిపాలనకు జాతీయపరిధులకు లోబడి సర్వాధికారాలు వినియోగించుకోవచ్చు. గ్రామపరిధిలో వనరులు వినియోగించుకొని మానవశక్తికి పనికల్పించవచ్చు. ప్రజల నిత్యావసర సరఫరాలు, గ్రామపరిపాలన సమకూర్చుకోవచ్చు. పౌరుని ప్రాథమిక హక్కులుగా గుర్తింపుపొందిన పదితరగతులవరకు విద్యా, వైద్యం, నివాసం, పని, గ్రామపరిపాలన పరిధిలో సమకూర్చుకోవచ్చు. పశువైద్యం మంచినీరు వనరులు సర్దుబాటువిధానాన్ని అనుసరించి గ్రామగ్రామం ఉమ్మడి కలిసి పనిచేయు పరిపాలన కార్యక్రమాలు. చేపట్టి సకల ఐశ్వర్యములు గ్రామపరిపాలనలో గ్రామప్రజలు పొందవచ్చు. రాష్ట్ర జాతీయసర్వశులు మినహాయించి మిగిలిన పాలనా అధికారాలు అన్ని గ్రామపరిపాలన పరిధినే కల్పించబడినవి. గ్రామపరిపాలనలో చేయగలిగిన ఉత్పత్తులన్నిటిని గ్రామపాలనాధికారాలు కల్పించబడినవి. నీటిపారుదలలు, రోడ్లనిర్మాణం, కాలువలనిర్మాణం, రవాణాసదుపాయములు, పన్నులు వసూళ్ళు, ఆస్తులు బదలాయింపులు వృద్ధాప్యపు పెన్షనులు, ఆహారవస్తువుల నిల్వలు, గిడ్డంగుల నిర్మాణం సకలగ్రామపరిధి ప్రజావసరాలు సాధారణవిద్యాకేంద్ర, పశువైద్యం అన్నిగ్రామపరిధిలో సమకూర్చుకొను పాలనా అధికారాలు గ్రామ

ప్రజారాజ్యమండలికి కల్పించబడినవి. గ్రామాన్ని స్వయంసమృద్ధిగా తీర్చిదిద్దు బాధ్యత గ్రామపాలకులకు వప్పచెప్పబడింది.

2. జిల్లా ప్రజారాజ్యమండలి నిర్మాణం :

పరిపాలన నిర్వహణ జిల్లాపరిధిలో రాష్ట్రప్రజాప్రభుత్వమండలి నియోజకవర్గాలలో ఎన్నికయిన రాష్ట్రప్రజాప్రభుత్వమండలి సభ్యులు జిల్లాపరిధిలో జాతీయప్రజాప్రభుత్వమండలి నియోజక వర్గాలలో ఎన్నికయిన జాతీయప్రజాప్రభుత్వమండలి సభ్యులు, జిల్లాప్రజారాజ్య మండలి సభ్యులుగా, జిల్లాల్లో నేరుగా ప్రజల ఓటుద్వారా కాని, లేక గ్రామప్రజారాజ్యమండలి అధ్యక్ష ఉపాధ్యక్ష ఓటు పట్టణ నగర ప్రజారాజ్యమండలి అధ్యక్ష ఉపాధ్యక్షుల ఓటు మరియు సభ్యుల ఓటుద్వారా ఎన్నికయిన జిల్లాప్రజారాజ్యమండలి అధ్యక్ష ఉపాధ్యక్షులు, అధ్యక్షవర్గంగా జిల్లా రాజ్యాంగసభ నిర్మాణం జరిగి జిల్లా పరిపాలనా బాధ్యత చేపడుతుంది. జిల్లాపరిపాలన అధికార పరిధిలో ఉన్నత విద్య ఉన్నత వైద్యం మధ్యరకం నీటివసరులు మధ్యరకం ప్రాజెక్టులు పరిశ్రమలు గనులు అడవులు సంరక్షణ, రవాణాసదుపాయములు, రహదారుల సంరక్షణ నిల్వలు, గిడ్డంగులు జిల్లాపరిధిలో గ్రామాలమధ్య వనరులు సర్దుబాటు, జిల్లాలమధ్య వనరులు, రవాణా సర్దుబాట్లు, రాష్ట్ర జాతీయవనరులు, సర్దుబాటువనరులు, పంపిణీ గ్రామావసరాలు సమకూర్చటం గ్రామవనరులకు వాణిజ్య సదుపాయములు కల్పించటం, గ్రామ ఉత్పత్తులపై పాలనపర్యవేక్షణ ప్రకృతి వైపరీత్యాలలో నష్టపరిహారాలు సహాయం కల్పించటం, జిల్లాపరిధిలో వ్యవసాయ పరిశోధనలు విత్తనోత్పత్తులు మొదలగు జిల్లా అవ

సర ఉత్పత్తులు, వాణిజ్యం రవాణాలు, సరఫరాలు సమకూర్చి, జిల్లాను స్వయం సమృద్ధి జిల్లాగా, తీర్చిదిద్దవలసివున్నది.

గ్రామరాజ్యం జిల్లారాజ్యం నిర్మాణం జరిగిన తదుపరి, రాష్ట్రప్రజాప్రభుత్వమండలి రాష్ట్రరాజధానులలోను జాతీయ ప్రజాప్రభుత్వమండలి జాతీయరాజధానిలోను సమావేశాలు జరిపి, కార్యనిర్వాహక కార్యవర్గాన్ని ఏర్పరచుటకు ఒక సభానాయకుని సభనిర్వహణకు ఒక అధ్యక్షుని ఎన్నుకొని, రాష్ట్రప్రజారాజ్యమండలి జాతీయ ప్రజారాజ్యమండలికి ప్రభుత్వమండలి సభలతరపున వారివారి ప్రతినిధులను పంపిస్తుంది. తదుపరి రాష్ట్రజాతీయ ప్రజారాజ్యమండలి ఏర్పడుతవి.

3. రాష్ట్రప్రజారాజ్యమండలి నిర్మాణం :

రాష్ట్రంలో జిల్లాల ప్రజారాజ్యమండలికి ఎన్నికయిన జిల్లా ప్రజారాజ్యమండలి అధ్యక్ష ఉపాధ్యక్షులు, రాష్ట్రప్రజాప్రభుత్వమండలి సభానాయకుడు సభ అధ్యక్షులు, రాష్ట్రప్రజారాజ్యమండలి సభ్యులుగాను ప్రజలచే ఎన్నికచేయబడిన రాష్ట్రప్రజారాజ్యమండలి అధ్యక్ష ఉపాధ్యక్షులు, అధ్యక్షవర్గంగాను రాష్ట్రరాజ్యాంగపాలన బాధ్యతలు చేపట్టి, రాష్ట్రప్రజల అవసరాలు ఉత్పత్తులు సరఫరాలు నిర్ధారిస్తుంది. రాష్ట్రప్రజాప్రభుత్వమండలి రూపొందించే చట్టాలు పునఃపరిశీలించి ఆమోదిస్తుంది. రాష్ట్రపరిధిలో గవర్నరు బాధ్యతలు రాష్ట్రప్రజారాజ్యమండలి నిర్వహిస్తుంది. రాష్ట్రాల చట్టసభలు జాతీయ అవుసరాల పరిధిలో చట్టాలు రూపొందించి రాష్ట్ర అవుసరాలకు పరిమితి కావాలి. న్యాయం అమలుపర్చుటకు అనుకూలంగా ప్రభుత్వ చట్టాలు వుండాలి. న్యాయవ్యతిరేకచర్యలకు చట్టసభలు పాలుపడితే

అందుకు బాధ్యులైన వ్యక్తులనుకాని లేక మొత్తం సభను రద్దుచేసి తిరిగి ఎన్నికలు జరుపు విధానం జాతీయంగా ఏర్పడే అన్ని సభలకు వర్తిస్తుంది.

4. జాతీయ ప్రజారాజ్యమండలి నిర్మాణం :

జాతీయంగా ప్రజారాజ్య రాజ్యాంగ విధులు నిర్వహించుటకు ప్రజారాజ్యమండలి నిర్మాణం జాతీయంగా రాష్ట్రాలలో ప్రజారాజ్య నిర్మాణాలు చేపట్టిన రాష్ట్రప్రజారాజ్యమండలి అధ్యక్షులు ఉపాధ్యక్షులు జాతీయ ప్రజాప్రభుత్వమండలి సభనాయకుడు సభనిర్వాహణ అధ్యక్షుడు జాతీయప్రజారాజ్యమండలి సభ్యులుగాను జాతీయంగా ఎన్నికకాబడిన జాతీయ ప్రజారాజ్యమండలి అధ్యక్షుడు ఉపాధ్యక్షుడు అధ్యక్షవర్గంగాను జాతీయ రాజ్యాంగ నిర్మాణం జరిగి పాలన నిర్వహణ బాధ్యతలు చేపడుతుంది.

జాతీయ రాష్ట్రప్రజారాజ్యమండలి పాలనాబాధ్యతలు ప్రభుత్వమండలి పాలనాబాధ్యతలు ఇంతకు ముందే నిర్ధారించబడినవి వాటి ఆధారంగా అవి పరిపాలనాబాధ్యతలు చేపడుతవి.

ప్రజాస్వామికపరిపక్వంతో నేచ్ఛాస్వాతంత్ర్యంతో నెలకొల్పబడిన రాజ్యాంగ రచన కార్యాచరణ దోషరహితంగా వుంటుంది. సానుకూలంగా ఆటంకాలకు అవకాశం ఇవ్వకుండా కార్యాచరణలో రూపొందించిన రచన ఇది.

నాలుగు అంచెల రాజ్యం ఎన్నికలు, నాలుగు అంచెలరాజ్యం నిర్మాణం నిర్వహణ విధానాలు ప్రజలకు ప్రాతినిధ్యానికి పాలన

యంత్రాంగానికి కల్పించిన జాతీయబాధ్యతలు న్యాయయంత్రాంగానికి కల్పించిన న్యాయబాధ్యతలు ఏఒక్కటి విస్మరించుటకు, అతిక్రమించుటకు అవకాశములు లేవు. వారివారికి కల్పించిన పాలనాబాధ్యతలు చిత్తశుద్ధితో శ్రమించి శక్తివంచన లేకుండా పాలనసేవలు ప్రజలకు అందించటం పాలనసేవలు అందించలేనివారు స్వయంవృత్తులలో నిమగ్నం కావటం జరుగుతుంది. వ్యయ ప్రయాసలు లేని ప్రజాతంత్ర రాజ్యాంగపాలన విధానమిది, ఈ రాజ్యానికి ప్రజలే రాజులు ప్రజలే పాలితులు.

## - తృతీయ భాగం -

ప్రజాస్వామిక ప్రభుత్వపాలనలో బాధ్యతలు :

1. పాలకుల విధులు
2. పాలితుల విధులు

రాజ్యం నిర్మాణంలో రాజులుగా అధికారం కలిగిన ప్రజలు పరిపాలనలో పాలితులుగా పాలనావిధానాలు ప్రజలకు శిరోధార్యంగా గుర్తించి, ప్రభుత్వపాలన ఆజ్ఞలు ఆధారంగా కర్తవ్యాలు నిర్వర్తించవలసివున్నది.

1) పాలకుల విధులు :

1. జాతీయ ఉత్పత్తులు నిర్ధారణ
2. వనరులు కేటాయింపు
3. సాంకేతిక సహాయం

4. ఆర్థికసహాయం

5. వాణిజ్య సదుపాయం

6. శ్రమకుతగిన వేతనం, వస్తువుకు గిట్టుబాటు ధరలు

7. నిల్వలు తరలింపు

8. ప్రకృతి కృత్రిమ ఉత్పత్తులు పెంచటం

9. భూగర్భవనరులు పొదుపు

10. ఎగుమతి వ్యాపారం పెంచటం

11. దిగుమతి వ్యాపారం తగ్గించటం

12. ప్రకృతి వైపరీత్యాలలో పూర్తి సహాయం అందించటం

13. పన్నులు చార్జీలు వేతనము సమన్వయపర్చి ధరలకు స్థిరత్వం కల్పించటం

14. పౌరుని ప్రాథమిక హక్కులు పరిరక్షణ

ఈ పాలనావిధులు ప్రభుత్వం నిర్వర్తించి పర్యవేక్షణ పరిపాలన విరామంలేకుండా అమలుజరుపటం ప్రజాపరిపాలన విధులు.

1. జాతీయంగా వనరులు మానవశక్తి ఆధారంగా జాతీయ ఉత్పత్తి నిర్ణయాలు తీసుకొనుటలో వనరులు సర్దుబాటువిధానాన్ని అనుసరించి మానవశక్తికి పూర్తిగా పనికల్పించవలసివున్నది.

2. గ్రామస్థాయినుండి రాష్ట్రస్థాయివరకు ప్రతివ్యక్తికి ప్రతీ ఉత్పత్తి వ్యవస్థకు వారికి తగినవిధంగా వనరులు కేటాయించి నిర్బంధ

పనులు కల్పించి, నిరుద్యోగం దారిద్రం తొలగించుటకు పరిపాలకులు తీవ్రకృషి చేయవలసివున్నది.

3. సాంకేతిక సహాయం ప్రతి వ్యక్తికి ప్రతి వృత్తికి అందించి గృహం ఒక పరిశ్రమగా, హృదయం ఒక ప్రయోగశాలగా రూపొందించవలసివున్నది. పరిపాలన సరిస్కరణల రూపకల్పనలో సాంకేతిక సహాయం అందించు విధానం రూపొందుతుంది.

4. ఆర్థిక సహాయం జాతీయంగా రూపొందించే ఉత్పత్తివిధానాన్ని అనుసరించి ప్రతి వృత్తికి ఉత్పత్తికి తగిన విధంగా ఆర్థిక సహాయక సంస్థలు ఇంటింటికి తిరిగి అవుసరానికి తగిన విధంగా ఆర్థిక సహాయం అందించి, వాణిజ్యపరంగా అప్పులు జమచేసుకొంటూ, ఆర్థికవృత్తిధర్మాన్ని నిర్వర్తించవలసివున్నది. సామాజికశక్తి వినియోగించి ఉత్పత్తి కుంటుపడకుండా విలువైన కాలం వృధాకాకుండా ఆర్థిక సంస్థలు కృషిచేయవలసివున్నది.

5. ఉత్పత్తిదారుకు వేరే ఆలోచన ఉదయించకుండా ప్రభుత్వం ముడి వనరులు సరఫరాలు తయారి సరుకులు అమ్మకాలు సదుపాయం పరిపాలన కల్పించి, మానవుని శ్రమను ఉత్పత్తిని పెంచుటకు కావలసిన పాలన సకలచర్యలు ప్రభుత్వం అందించి, వనరులు మానవశక్తి వృధాకాకుండా వినియోగించవలసివున్నది.

6. శ్రమకు తగిన వేతనం, వస్తువుకు గిట్టుబాటుధర కల్పించటం పాలకుల విధి, శ్రమశక్తి పెంపొందించుకొనుచూ వస్తునాణ్యత పెంచుకొనుటకు ఉపయోగపడు ఉత్పత్తివిధానం జాతికి ఇప్పుడు అవుసరం.

7. నిల్వాలు తరలించటం, శ్రమ శ్రమకుతగిన వేతనం నిర్విరామంగా కొనసాగించుటకు ఉత్పత్తిదారువద్ద వస్తువు నిల్వవుంచటం మంచిదికాదు, వస్తువు తరలించినపుడే ఉత్పత్తిదారు నిర్విరామంగా శ్రమించి ఉత్పత్తిచేయగలడు, ప్రభుత్వం ముందుచూపుతో వాణిజ్య రవాణాలకు అనుగుణంగా ఏర్పరుచుకొని ఉత్పత్తి ప్రారంభించాలి, వాణిజ్య అన్వేషణ ప్రభుత్వం ఎప్పుడు చేయుచుండాలి. ఉత్పత్తి వాణిజ్యం రవాణాలకే ప్రభుత్వపాలన పరిమితిచేయుటకుగల కారణం ఇది, వనరులు మానవశక్తి సద్వినియోగంవలననే ప్రజాస్వామిక ప్రభుత్వం సుస్థిరత కలిగివుంటుంది. ఆ సుస్థిరత సాధనకే పరిపాలన యంత్రాంగాన్ని వేరే ఆలోచనల అవకాశం కల్పించకుండా ఉత్పత్తి వాణిజ్యం రవాణాపరిపాలనకు పరిమితి చేయబడింది.

8. ప్రకృతి కృత్రిమ ఉత్పత్తులు పెంచటం దేశంలో ప్రకృతి ప్రసాదించే వనరులు కృత్రిమవిధానాలు అవలంభించి చేసెడి వనరులు వృధాగా పోకుండా సద్వినియోగపర్చి సామాజిక అవసరాలు ప్రకృతి ప్రసాదించే వనరులకు ముడివడి వున్నందున ప్రకృతివనరుల ఉత్పత్తులు అధికమొత్తంలో పెంచవలసివున్నది. ప్రకృతివనరులు కృత్రిమవనరుల ఉత్పత్తులు అధికభాగం మానవశ్రమపై ఆధారపడివున్నవి. విదేశాలకు ఎగుమతులు దేశానికి మిగిలిన ప్రకృతి సంపదల ఉత్పత్తులు పెంపొందించాలి. భూగర్భసంపదలు ఉత్పత్తులు దేశ అవుసరాలకు మించి చేయకూడదు.

9. భూగర్భవనరులు పొదుపు భూగర్భసంపదలు దేశానికి స్థిరమైన ఆస్థి. స్థిరమైన ఆస్థిని గుర్తించకుండా స్వాతంత్ర్యానంతరం

వచ్చిపోయే ప్రభుత్వాలు ఆర్థిక స్వార్థంతో దేశ స్థిరసంపదలను కొల్లగొట్టుచున్నవి. ఒకసారి దేశ స్థిరసంపదలు ఖాళీఅయిపోతే దేశానికి మట్టితప్ప ఇంకేమి మిగలదు. భవిష్యత్ లో ముందుతరాలవారు విదేశాలమీద ఆధారపడి వారి అవసరాలు గడుపుకోవటం తప్ప దేశం వారికి ఉపయోగపడదు. దేశపాలన స్వార్థులచేతులలోపడి ఇప్పటికే దేశంలో స్థిరసంపదలు విదేశాలకు తరలించటం జరిగింది. ఇక ఒక్క రూపాయి విలువగల స్థిరసంపద విదేశానికి తరలించకుండా ప్రభుత్వం నిషేధించాలి.

**10.** ఎగుమతి వ్యాపారాలు పెంచటం, ప్రకృతి ప్రసాదించే వనరుల ఉత్పత్తులు కృత్రిమ ఉత్పత్తులు దేశంలో విరివిగా ఉత్పత్తులు చేసి ఎగుమతి వ్యాపారాలు పెంపొందించాలి.

**11.** దిగుమతి వ్యాపారం తగ్గించటం దేశీయంగా ముడివస్తువు దొరకని ఉత్పత్తులు దేశీయంగా సాంకేతిక విజ్ఞానంలేని జాతీయ అవుసర ఉత్పత్తులు పరిమితిగా దిగుమతిచేసుకొని విదేశాలనుండి దిగుమతి చేసుకునే ఆడంబర వస్తువులు దిగుమతులు నిషేధించాలి. విదేశాల నుండి తప్పనిసరి దిగుమతులలో పొదుపు పాటించి దిగుమతి వాణిజ్యాన్ని తగ్గించాలి విదేశశక్తులు భారతదేశంలో కలిగివున్న పేటెంటుహక్కులు అన్ని రద్దుచేయాలి.

**12.** ప్రకృతి వైపరీత్యాలలో పూర్తిసహాయం అందించి ఉత్పత్తులు యధాతథంగా కొనసాగించినపుడు దేశం వడుదుడుకులకు లోనుకాదు. భీమాపతకాలు జాతీయ ఉత్పత్తివిధానానికి జాతీయ ఆదాయం పెంచుటకు యోగ్యమైనవి కావు. ఒక్కో దశలో

జాతీయ ఆదాయంతాలూకు వస్తువు ఉత్పత్తికూడా దెబ్బతినే లక్ష్యం భీమా విధానంలో వున్నది. అక్రమధనం పోగుపడుటకు భీమా సంస్థలు కారణమగుచున్నది. వస్తుభద్రతాభావం దెబ్బతింటున్నది. వస్తువుకు భద్రతాభావం కల్పించటం ప్రభుత్వపాలన కర్తవ్యం, భీమా విధానాన్ని రద్దుచేసి ప్రకృతి వైపరీత్యాలమీద పరిశోధన జరిపి వాస్తవసహాయం అందించితే జాతీయంగా వస్తువుపై భద్రతా భావం పెరుగుతుంది. కొన్ని వేలకోట్లరూపాయలు జాతీయ ఆదాయం పొదుపుకు వస్తుంది.

13. పన్నులు చార్జీలు వేతనములు సమన్వయపర్చి ధరలకు స్థిరత్వం కల్పించటం, వేతనములు పెరిగి పన్నులు చార్జీలు పెరగటం, పన్నులు చార్జీలు పెరిగి ధరలు పెరగటం నిత్యకృత్యంగా చక్రాకారంగా తిరుగుచూ ధరలు పెరగటం అధికార వ్యాపార వర్గాలకు లాభం చేకూర్చి శ్రమజీవిని పీల్చి పిప్పిచేయటం 1947 స్వాతంత్ర్యం వచ్చినదగ్గరనుండి జరుగుతున్న పాలనాతతంగం ఇది. ఐదు పది శాతం భోగలాలసత్వాన్ని డెబ్బదిశాతం ప్రజలు పోషించటం ఆచారంగా మారింది. ఈనాడు వారిజీవనానికి రోజుకు 15 రూపాయలకంటె వ్యయం చేయలేని కుటుంబాలు చాలా వున్నవి. రోజుకు 100/- రూపాయలు జీతం తీసుకునేవారు రోజువారి జీవనవ్యయానికి చాలటం లేదంటున్నారు. ఇది ఏమిప్రజాస్వామ్యం ? ఎటువంటి సామాజిక న్యాయం, జాతీయవాదం, సామాన్యుని జీవనవ్యయం మెరుగుపడవలెనంటె పన్నులు చార్జీలు వేతనములు సమన్వయపర్చి ధరలు స్థిరత్వం కల్పించి 1994 వ సంవత్సరంలో వున్న పన్నులు చార్జీలు వేతనములు ధరలు అమలుపరిస్తే ధరలు దరిద్రవర్గాలకు అందుబాటులో వుంటవి.

దరిద్రవర్గాలు వారి ఆదాయం పెంచుకొను మార్గం అందుబాటులోకి వస్తుంది. నిత్యజీవనం సంతృప్తిగా జీవించు మార్గంలభిస్తుంది. పాలన చర్యలు అన్న పేదవాని జీవనం మెరుగుపర్చు విధంగా వుండాలి.

14. పౌరుని ప్రాథమికహక్కులు పరిరక్షణ గత ఏబది సంవత్సరములు స్వపాలనలో సామాజికన్యాయం జాతీయభావం ఉపన్యాసాలకే పరిమితమైంది కాని, ఆచరణలో అసలు ఆలోచనరాలేదు. జాతీయవాదం ఎన్నికలకు పరిమితం చేయబడంది కాని వివక్షతలు తొలగించలేదు నిత్యం బడుగుపతనమే కాని బడుగును తొలగించు సామాజిక సాంస్కృతిక సమానత్వాన్ని కల్పించు పరిపాలన కార్యక్రమంలేదు. గతంలో కల్పించిన పౌరుని ప్రాథమికహక్కులు భావస్వాతంత్ర్యం, పత్రికా స్వాతంత్ర్యం, వాక్కు స్వాతంత్ర్యం స్వాతంత్ర్యానంతరం క్రమంగా ప్రభుత్వం హరించింది. అయినా అవి కాలం చెల్లిన పౌరహక్కులు, ఈనాడు పౌరునికి కావలసిన హక్కులు మానవతా నినాదం జాతీయవాదం సమపౌరసత్వం సమానత్వం సామాజిక సాంస్కృతిక సమానత్వం, జాతీయనినాదం పౌరుని ప్రాథమిక హక్కు కావాలి, పాలనావిధానాలు పైవాక్యాలను అనుసరించాలి. 1) విద్యావిజ్ఞానం 2) వైద్యం ఆరోగ్యం 3) నివాసం 4) పని, పౌరుని ప్రాథమికహక్కుగా పరిపాలన ఆచరణలో చేపట్టినపుడు మానవతా నినాదానికి అర్థందొరుకుతుంది, జాతీయవాదం నిలబడుతుంది, సామాజిక సాంస్కృతిక సమానత్వం ఏర్పడుతుంది, వివక్షతలు తొలిగిపోతవి సమానత్వం నెలకొంటుంది.

పాలకులు గుర్తించాల్సిన ఈ పదునాలుగు పరిపాలనాధర్మాలు పాలకులు గుర్తించి ఆచరణలో అమలుజరిపి జాతీయతకు రూపుదిద్దాలి

పరిపాలన ప్రతిచర్యలో జాతీయభావం జాతీయవాదం కల్పించాలి, వివక్షలు పురికొల్పే రాజకీయ స్వార్ధులకు ఆర్థిక స్వార్ధులకు ఎటువంటి అవకాశములకు పరిపాలనలో చోటివ్వరాదు.

2. పాలితుల విధులు :

ప్రజాప్రతినిధులను ఎన్నుకొనునపుడు రాజులస్థానంలో వున్న ప్రజలు ప్రభుత్వాలను నెలకొల్పిన తదుపరి రాజ్యం పరిధిలో ప్రజలు పాలితులుగా మార్పు జెంది, ప్రభుత్వపరిపాలన ఆజ్ఞలను శిరసావహించాలి ప్రజలు నిత్యకృత్య ధర్మాలు ప్రజలు నిర్వర్తించాలి. మానవ కర్తవ్యం గుర్తించి నిర్వహణలో ముందునిలబడినపుడు ప్రజాస్వామిక పాలన దేశం మూడు పూవులు, ఆరు కాయలుగా అభివృద్ధి జెందుతుంది. ప్రజాస్వామ్యం సుస్థిరతకలిగివుంటుంది. ప్రజాస్వామ్యం సుస్థిరంగా వుండుటకు ఈ దిగువ విధానాలు ప్రజలు నిర్వర్తించటం వారి కర్తవ్యంగా గుర్తించి ఆచరించాలి.

1. ప్రభుత్వ ఆదేశంప్రకారం ఉత్పత్తులు
2. ప్రభుత్వ ఆస్తులు పరిరక్షణ
3. తప్పనిసరిగా చదువుకోవటం
4. స్వయం వృత్తులపై దృష్టిసారించటం
5. సాంఘిక దురలలవాట్లు మానుకోవటం
6. ఉచిత స్వార్థాలు వదులుకోవటం
7. సామాజిక వివక్షతలు తొలిగించుకోవటం

8. పనికి తగిన వేతనం, ఉత్పత్తికి గిట్టుబాటు ధర కోరటం
9. సంఘవిద్రోహశక్తిని అరికట్టటం
10. కుటుంబజనాభాను అదులో వుంచటం
11. పాలనాయంత్రాంగానికి సహకరించటం
12. తప్పుచేస్తే శిక్ష వుంటుందని గుర్తించటం
13. అన్యాయాన్ని ఖండించటం
14. న్యాయమార్గాన్ని ఆశించటం

ఈ పదునాలుగు ప్రజల కార్యక్రమాలు, ప్రజలు తమ కర్తవ్యంగా భావించి బాధ్యతలు నిర్వర్తించినపుడు దేశం స్వర్గతుల్యంగా మారుతుంది. సాధారణంగా చిన్న సన్న పరిశ్రమలు, కుటీరపరిశ్రమలు, చేతివృత్తులు, వ్యవసాయం. వ్యవసాయపరిశ్రమలు, జలచర పరిశ్రమలు, వనముల పోషణ, వన సంరక్షణ, గృహనిర్మాణపరిశ్రమలు సాధారణంగా మానవుని నిత్యావసర పరిశ్రమ అంతా గ్రామ స్థాయిలో వుంటుంది. గ్రామస్థాయి ఉత్పత్తులు అన్నిటికి ప్రభుత్వం సాంకేతిక ఆర్థిక వాణిజ్యసహాయం అందిస్తుంది. ప్రభుత్వాన్ని అనుసరించటం ప్రజల కర్తవ్యం.

1. ప్రభుత్వం ఆదేశం ప్రకారం ఉత్పత్తులు ప్రభుత్వ సహాయం ప్రభుత్వం కల్పిస్తుంది. ప్రజలు శక్తిసామర్థ్యాన్ని అనుసరించి వారు లాభసాటిగా గుర్తించి నిర్ణయించుచున్న వృత్తిపనివారు చేపట్టవచ్చు, కాని మూకుమ్మడి ఒకే ఉత్పత్తి వృత్తిచేపట్టటం సాధ్యం

కాదు. వినిమయ అవసరంప్రకారం వృత్తి ఉత్పత్తిచేపట్టాలి, ప్రభుత్వ సహాయం పొందాలి.

2. ప్రజల సౌకర్యార్థం ప్రభుత్వం కల్పించిన ఖాళీ స్థలములు రహదారులు, చెరువులు, కుంటలు, అడవులు, కాలువలు, కట్టలు, వాగులు, వనములు, కొండలు, గుట్టలు ప్రజలు వారి ఇష్టంవచ్చినట్టు అపహరించకూడదు. ప్రభుత్వ ఆస్తులు సామాజిక అవసరాలకు ఉప యోగపర్చుకోవచ్చు కాని వ్యక్తుల ప్రయోజనాలకు వినియోగించ రాదు.

3. నిర్బంధ విద్య ప్రతి ఒక్కరికి అవసరమైనది. ఏవృత్తి చేపట్టవలెనన్నా ఏ ఉత్పత్తి చేపట్టవలెనన్నా విద్యాఅనుభవం రెండూ మానవునికి అవుసరమైనవే. గతం గతించినా వచ్చుచున్న తరానికి నిర్బంధంగా విద్య విజ్ఞానం కల్పించి వృత్తులు కల్పించాలి. పిల్లల చదువు భవిష్యత్‌కు వెలుగులు కావాలి. నిర్బంధవిద్యను అందరూ ప్రోత్సహించాలి.

4. విద్యా విజ్ఞానం సంపాదించిన వ్యక్తులు లాభసాటి స్వయం వృత్తులు చేపట్టుటకు దృష్టి సారించాలి. అన్నిటికి ప్రభుత్వం వున్నదనే గుడ్డిగా నమ్మటం కాకుండా లాభసాటి వ్యాపారదృష్టితో స్వ ఆలోచనతో వృత్తి ఉత్పత్తి చేపట్టాలి.

5. సాంఘిక దుర అలవాట్లు వారు స్వచ్ఛందంగా మానుకో వాలి. జూదాలు, చిత్తాటలు, పేకాటలు, బ్రాకెట్ ఆటలు, త్రాగుడు చుట్టా బీడీ సిగిరెట్టు త్రాగటం దుర అలవాట్ల క్రిందకు వచ్చును.

దుర అలవాట్లు గుర్తించిన వాటిని మానుకోవటం ప్రజలధర్మం, కర్తవ్యంకూడా.

6. శ్రమలేకుండా ఏవిధంగా ఉచిత ఆదాయం వచ్చు మార్గం కనిపించినా వివరం తెలుసుకోకుండా ఆదాయాన్ని తీసుకో కూడదు, అక్రమధన ఆర్జనకు మానవుడు అలవాటుపడితే అక్రమ చర్యలద్వారా ధనార్జనచేయుటకు మానవుడు వెనుకాడడు. మానవుని ఆశలు అదుపులోవుంచుటకు ధనాకర్షణ అదుపుచేయటం మంచిది.

7. దేశంలో లెక్కకు మిక్కిలి కులాలు, కులాలను కూడ గట్టిన మతాలు, ప్రజాస్వామిక పరిపాలన దేశాన్ని ఛిన్నాభిన్నం చేయుచున్నవి. లోవైనం వున్న సమైక్యతను చెడగొట్టినవి, ప్రజాస్వామిక రాజ్యంలో వివక్షతలకు తావులేదని సమైక్యతకు చోటువున్నదని సంపూర్ణ ప్రజాస్వామిక ప్రజలు ఋజువుచేయటం వారి బాధ్యత.

8. ప్రతివ్యక్తి పనికి తగిన వేతనం కోరవచ్చు. ఉత్పత్తికి గిట్టుబాటు ధర కోరవచ్చు కాని, శ్రమ తక్కువగాచేసి అధికవేతనం కోరటం ఉత్పత్తి నాణ్యత తగ్గించి, గిట్టుబాటుధర కోరటం మంచిది కాదు. శ్రమకు నిపుణతకు పోటీపడి వస్తు నాణ్యతకు పోటీపడి తగిన వేతనం గిట్టుబాటుధర కోరటంలో తప్పువుండదు.

9. సంఘవిద్రోహశక్తిని అరికట్టటం పరిపాలన వికేంద్రీకరణ విధానంలో ప్రజలకు తెలియకుండా ఏ సంఘ విద్రోహశక్తి పనిచేయలేదు. ఎవరు దేశద్రోహానికి సంఘద్రోహానికి పరిపాలన

ద్రోహానికి పాలుపడినా తక్షణం వానిని అదుపుచేయటం లేక శిక్షించుటకు సహకరించటం ప్రజాస్వామిక పరిపాలనలో ప్రజల కర్తవ్యం, వార్డు ప్రజలకు వార్డు ప్రజాప్రతినిధికి తెలియకుండా గ్రామాలలోగాని పట్టణాలలోగాని నగరాలలోగాని సంఘవిద్రోహశక్తి ఇతర విదేశశక్తులు విజృంభించలేవు. ఉగ్రవాదులు టెర్రరిష్టులు స్మగ్లర్లు మాఫియాలు స్థానికుల ఆదరణ లేకుండా తిరగలేరు. ఎవరి పరిధిలో వారు జవాబుదారులుగా సామాజిక బాధ్యతలు నిర్వహిస్తే పోలీసు వ్యవస్థతో పనివుండదు, ప్రజాస్వామిక రాజ్యంలో సామాజిక బాధ్యతలు సమాజం నిర్వహిస్తే దేశం నిజమైన అహింసాదేశంగా ప్రపంచంలో ప్రఖ్యాతిపొందుతుంది. ఇందుకు ప్రతివ్యక్తి కంకణధారులు కావాలి ప్రజలు మంచి చరిత్ర సృష్టించాలి.

10. **కుటుంబ** జనాభాను అదుపులోవుంచాలి. అధిక జనాభా ఎన్ని అనర్థాలను సృష్టించిందో అందరూ తెలుసుకున్నారు. కాని బాధ్యతలు నిర్వర్తించిన కుటుంబాలుమాత్రం అతి తక్కువగా వున్నవి. 1993 జననాల లెక్కలప్రకారం ఇద్దరికి మించిన జననాల సంఖ్య 9% **శాతం** కనుపించింది. అందరూ ఇద్దరికి ఇద్దరు అనే నినాదాన్ని అనుసరించి సంతాననియంత్రణ అమలుజరిపిఫుంటే దేశంలో జనన మరణాలు సమసంఖ్యకు దగ్గరలో వుండేవి. సంపూర్ణ గ్రామపాలన ప్రజలను పాలకులను బాధ్యులుగా చేయుచున్నందున ఇద్దరికి మరి ఇద్దరు సంతానాన్ని నిర్బంధంచేసి బహుమతి ఆర్థికబాండ్లు ప్రవేశపెట్టి సంతానాన్ని తగ్గించు పాలనచర్యలు చేపట్టి జననాలు తగ్గించి జనాభా తగ్గించు బాధ్యత ప్రతి కుటుంబంపై వున్నది. స్వాతంత్ర్యానంతరం ప్రజాస్వామిక పాలనాబాధ్యతలు మరిచినవారు

రాజకీయ ప్రవేశంచేసి అధికజనాభాను పెంచినారు. కులమతాలు పోటీపడి జననాలను పెంచినవి, దేశంలో అధికజనాభాను పెంచి పోషించిన నాయకులు నిరుద్యోగాన్ని దరిద్రాన్ని గురించి అతిగా వాపోతుంటారు. కులమత నాయకులు జననాలను అదుపులోవుంచటం వారి బాధ్యతకాదా అధికసంతానం దేశానికి అనర్థదాయకమని తెలిసి జననాలను అదుపులోవుంచలేదంటే దేశంయెడ వారి బాధ్యత వారికి అవుసరంలేదు కాని జనాభాప్రాతిపదికన వారికోర్కెలు వారు సాధించుకోవాలి. జాతీయవిధానానికి జాతీయన్యాయసాధనకు సామాజిక సాంస్కృతిక సమానత్వానికి అడ్డుగోడలుగానిలచిన సంకుచితతత్వాన్ని తొలిగించి ప్రజాస్వామికంగా రాజ్యాంగాన్ని అమలుజరిపితే వివక్షతలు వుండవు. ఒకేచట్టం ఒకేన్యాయం అందరికి వర్తిస్తుంది.

11. మన నిత్యకృత్యంలో పరిపాలనా యంత్రాంగానికి సహాయ సహకారాలు చోటుకల్పించినందున పాలనాయంత్రాంగం చూపించిన దారిన ప్రజలునడుచుకోవాలి. వారి అవుసరాలు ప్రజలకు వున్నంతవరకు ప్రజలు పాలనయంత్రాంగానికి సహకరించాలి. పాలనాయంత్రాంగం ప్రజలు పరస్పర అవగాహనతో ఉత్పత్తి రెట్టింపులు చేయాలి. ఉత్పత్తిసాధనాలు అన్నిప్రజలచేతికిచ్చి పరిపాలన పర్యవేక్షణకు ప్రభుత్వం పరిమితం అవుతున్నందున ప్రజలబాధ్యత రెట్టింపులు పెరిగినవి. పెరిగినబాధ్యతలు ఆధారంగా ప్రజలు స్వచ్ఛందంగా వృత్తిధర్మాలు కల్పించుకోవాలి, లేనిపక్షంలో ప్రభుత్వం నిర్బంధంగా కల్పిస్తుందని గుర్తించాలి.

12. ప్రజలకు స్వేచ్ఛాస్వాతంత్ర్యం వ్యక్తికి వ్యవస్థలకు ఎంత సులువుగా లభించిందో తప్పుచేస్తే శిక్షలు అంత కఠినంగా వుంటవని ప్రతి ఒక్కరు గుర్తించి నడుచుకోవాలి, మానవునిలో అక్రమస్వార్థ గుణాలను చంపుటకు శిక్షలు మొదట తప్పుచేసినవానిని శిక్షించక పోతే తప్పులుచేసేవారు పెరగటం సహజం. క్రమంగా గ్రామం దేశం నేరచరిత్రలో రూపుదిద్దుకొంటుంది. న్యాయం నిల్వదు, ధర్మం వుండదు, న్యాయ ధర్మాలు లేని దేశం దోపిడిదేశంగా ప్రసిద్ధిపొందు తుంది. ప్రజాస్వామిక దేశానికి భయం వెంటాడుతుంది. అటువంటి చరిత్రకు చోటులేకుండా గ్రామప్రజలు గ్రామపాలకులు మొదట తప్పుచేసినవానికి కఠినశిక్ష విధిస్తే తప్పుఅంటే ప్రజలకు శిక్షలభయం వెంటాడుతుంది. చెడును గోటితోగిల్లిన చందంగా నేరచరిత్ర నిర్మూ లించబడుతుంది.

13. అన్యాయాన్ని ఖండించకుంటే మానవస్వభావం స్వార్థ పూరితమైనది. ఆవేశపూరితమైనది. ఆవేశం అన్యాయాన్ని ప్రేరేపి స్తుంది, సహచరసమాజం వానిని సమయస్ఫూర్తిగా అదుపుచేస్తే అణిగిపోతుంది. వదిలేస్తే అదుపుతప్పి ప్రవర్తిస్తుంది సమాజం క్రమ శిక్షణ పాటించటం విఫలమైనపుడు పరిపాలన దండనీతి తప్పదు. ప్రభుత్వం దండనీతి ప్రజాస్వామిక ప్రభుత్వానికి తప్పదు. ప్రజా స్వామిక పరిపాలన దేశంలో ప్రజలు నీతితప్పినపుడు దండనీతి కఠినంగా అమలుజరుపుతుందని ప్రజలకు భయం కలుగు విధంగా దండనీతి వుంటుందని ప్రజలు గుర్తించి నడుచుకోవాలి.

14. ప్రజలు ప్రభుత్వానికి సమస్యలు సృష్టించి ఇరుకున పెట్టు విధానాన్ని అవలంభించకూడదు. ప్రభుత్వం వృత్తిధర్మాలు

నిర్వర్తించుటకు ప్రజల పూర్తి సహకారం అందించి న్యాయమార్గంలో వారి ఆదాయాలు పెంచుకొనుచూ ప్రతి ఒక్కరు ఇతరులకు ఆదర్శం కావాలనే పోటీకల్పించుకొని ముందుకు సాగినపుడు దేశం న్యాయ మార్గాన్ని ఆశించినవారౌతారు, సుఖసంతోషాలకు శాంతి సౌభా గ్యాలకు ప్రజలు కారణమని గుర్తించి న్యాయమార్గంలో పయ నించాలి.

ఈ పదునాలుగుభావాలు ప్రజలు అర్థంచేసుకొని ప్రభుత్వ సహకారం తీసుకొని ప్రజలు ప్రభుత్వం కలిసి పనిచేస్తే భారత ప్రజా తంత్రానికి ఏదేశము చాలదు. ప్రజాపాలన ధర్మాలు అమలు జరుప మని ప్రజలు ప్రభుత్వాన్ని కోరాలి, ప్రజలు స్వార్థాన్ని ఆసిస్తే ప్రభుత్వం తప్పుదారినపడుతుంది. ప్రజలను దోపిడిచేసేదిగా ప్రభుత్వం రూపుదిద్దుకొంటుంది. ప్రజలు న్యాయ దర్మ మార్గాన నడిచి ప్రభు త్వాన్ని తప్పుదారిన పడకుండా చూడటం ప్రజల కర్తవ్యం.

## - చతుర్థ భాగము -

పరిపాలనా సంస్కరణలు :

ప్రజల ఇండ్లకు పరిపాలనాసేవలు అందించు విధానం.

1. విద్య విజ్ఞానం
2. వైద్యం ఆరోగ్యం
3. పశువైద్యం పశుగణాభివృద్ధి

4. భూసార సంరక్షణ సస్యపోషణ

5. వనరులు మానవశక్తి వినియోగం

6. వెనుకబడిన ప్రాంతం ప్రత్యేక అభివృద్ధి

7. గృహానిర్మాణం

8. జాతీయ జలవనరులు వినియోగం

9. ప్రతిభ ఆధార పరిపాలన

పరిపాలనా సంస్కరణలు అమలు జరుపుటకు ఆర్థిక సంస్కరణలు జోడు కలిపినపుడు జాతీయంగా ఐదు సంవత్సరములలో దరిద్ర రేఖ దాటించి స్వయం సమృద్ధిదేశంగా భారతదేశాన్ని తీర్చిదిద్దు సంస్కరణ విధానంలో ఆదర్శ ప్రజారాజ్యం రచన కొనసాగుతుంది, ఏ వ్యక్తిమీద ఏ శక్తిమీద ఆధారపడకుండా సర్వము ప్రజాశక్తితో రాజ్యాంగ నిర్మాణం నిర్వహణలు రూపొందుచున్న రచనావిధానమిది.

నాలుగు అంచెల రాజ్యంలో గ్రామపరిపాలనా బాధ్యతలు ప్రధానంగా రూపుదిద్దుకొనుటకు పరిపాలన పర్యవేక్షణ సాంకేతిక విజ్ఞానం కలిగి పనిచేసినపుడు పని సానుకూలత సాధ్యమౌతుంది. సాంకేతిక విజ్ఞానం లేని పాలన సంస్కరణ నిరుపయోగం అవుతుంది. సాంకేతిక ఆర్థిక వాణిజ్య సహాయాలతో పరిపాలన సంస్కరణలు అమలుజరిపితే విజయవంతంగా ఏఆటంకములు లేకుండా సాగిపోతుంది సంపూర్ణ సంస్కరణలు ప్రజా స్వామిక పరిపాలనకు రాజమార్గాలు.

పరిపాలన సంస్కరణలు అమలుజరుపుటకు పరిమితి జనాభా విభజన జరగాలి, యూనిటువైజుగా 5000/- వేల జనాభాను సాంకేతిక విజ్ఞాన ఒక యూనిట్‌గా విభజించి యూనిట్‌కు ఒకరుచొప్పున విద్యాధికారిని యూనిట్‌కు ఇద్దరుచొప్పున వైద్య పట్టభద్రులను యూనిట్‌కు ఒకరుచొప్పున పశువైద్య పట్టభద్రుని యూనిట్‌కు ఒకరిచొప్పున వ్యవసాయ పట్టభద్రుని యూనిట్‌కు ఒకరిచొప్పున, ఇంజనీరింగు పట్టబద్రుని నియమించి వనరులు మానవశక్తి సద్వినియోగపర్చు సంస్కరణ విధానంలో భారతదేశ జనాభాను 94/- కోట్లు జనాభాగా గుర్తించి యూనిటువైజుగా విభజిస్తే 1,88,000/- వేలు యూనిట్లు అవుతవి. క్రమంగా మూడింట ఒక వంతు జనాభాను తగ్గించు ఆలోచనతో జనాభాను తగ్గించు పాలనా కార్యక్రమం ఆ యా యూనిటు పరిధి గ్రామపరిపాలనకు అధికారాలు కల్పిస్తూ భవిష్యత్‌లో 5000/- వేలు యూనిట్ జనాభాను నిర్ధారిస్తూ యూనిట్ ప్రస్తుత జనాభా 7500/- చొప్పున 1,25,333 యూనిట్లుగా పరిపాలన సహాయ పాలన కార్యక్రమాలు, ఆర్థికవనరులు సాంకేతిక సహాయంతో రూపొందించటం జరుగుచున్నది. వృద్ధులు మరణశాతం పెరుగుటవలన కలుషిత వాతావరణం వలన మరణాలశాతం పెరిగి అనతికాలంలో జనాభా పరిమితికి వస్తుంది.

1. విద్య విజ్ఞానం :

విద్య విద్యార్థిదశ 4 వ సంవత్సరం ప్రారంభంనుండి 3 సంవత్సరములు ఆటపాటలు, త్రిభాషాసూత్ర ఆధారంగా భాష సంభాషణలు, తదుపరి 3 సంవత్సరములు క్రమశిక్షణ వ్యాకరణంతో కూడిన

అక్షరజ్ఞానం, తదుపరి 6 సం॥లు వృత్తి విజ్ఞానం, వ్యాపార జ్ఞానం, పాలన విజ్ఞానం, ఆరోగ్యజ్ఞానం, సామాజిక విజ్ఞానం 10 తరగతులు 15 సం॥రం వరకు నిర్బంధవిద్యలు అవలంభించి బాలబాలికలను స్వయంకృషికి సిద్ధంచేయటం పౌరుని ప్రాథమిక హక్కులు అమలు జరుపటం.

తదుపరి ప్రతి 3 సం॥లకు విద్యావిజ్ఞానం పెంచుకొంటూ 24 సం॥ శాస్త్రీయ విద్య, శాస్త్రీయ పరిశోధన విద్య పూర్తి చేయువరకు ప్రతిభ సాధించకలిగిన విద్యార్థులు నిరాటంకంగా విద్య కొనసాగించ వచ్చు, ప్రతిభ సాధించలేని విద్యార్థులు 10 తరగతి నుండి తదుపరి జరిపే ప్రతిపరీక్షలో ప్రతిభ ఆధారవిద్య కొనసాగించవలసివున్నది, చదివినచదువు తిరిగి చదువు అవకాశం వుండదు, ఏ స్థాయిలో ప్రతిభ సాధించలేని విద్యార్థులు ఈ స్థాయిలో స్వయం కృషిలో నిమగ్నం కావలశివుంటుంది.

జాతీయంగా విద్యార్థులు విద్యార్థినిలు 30 కోట్లుగా నిర్ధారించి పరాసరి బాల్యదశనుండి 24 సంవత్సరం ముగియువరకు చదువరులుగా నిర్ధారించి విద్యార్థి ఒకరికి రు. 1500 లు సగటువ్యయం నిర్ధారించి షుమారు 45 వేలు రూ॥లు సంవత్సరం వ్యయంగా యూనిటుపరిధిలో రు. 35 లక్షలు వ్యయంతో 10 తరగతివరకు నిర్బంధవిద్య ప్రతిభ ఆధారంగా పైవిద్యలు అందరికి భేదంలేని విద్యావిధానం కల్పించబడుతుంది.

విద్యార్థి విద్యదశలో శ్రద్ధాసక్తులు పెంపొందించుకొను విధంగా విద్యావిధానం రూపొందించబడును. మానశిక వికాసంతో

విద్యార్థి పండితస్థాయికి పరిశోధన స్థాయికి చేరుటకు ఎవరికి ఎటువంటి వివక్షతలు ఆటంకాలు వుండవు. జాతీయత సామాజిక సాంస్కృతిక సమానత్వం ఆధారంగా కల్పించిన పౌరుని ప్రాథమిక హక్కులకు అనుగుణంగా విద్యావిధానం రూపొందించబడింది. బాలకార్మిక సమస్యలు సమసిపోతవి, వివక్షతలు తొలిగిపోతవి సమభావం ఏర్పడినపుడు హెచ్చుతగ్గులు విమర్శలు వుండవు, జాతీయతకు మార్గం సుఖమౌతుంది. విద్వేషం బాల బాలికలలో ఉదయించదు. సామాజిక న్యాయం అమలుజరుపు మంచిమార్గం ఇది సమభావం సమానత్వం సాధించు మంచి అవకాశమిది వృత్తి ఉత్పత్తులు ప్రతిభ బాధ్యతలు పెంపొందించు విద్యా విధానం బాల్యంనుండి శ్రద్ధాసక్తులు పెంపొందించు విధ్యావిదానమది.

## 2. వైద్యం ఆరోగ్యం :

వైద్యం వైద్యపరిరక్షణ ప్రతి వ్యక్తికి అందించ కలిగినపుడే సామాజిక న్యాయం సమానంగా అమలుజరుగుతుంది, పౌరుని ప్రాథమిక హక్కులలో భాగమైన వైద్యం ఆరోగ్యం గ్రామానికి అందించి ప్రతివ్యక్తిని ఆరు నెలలకు ఒకసారి వైద్యపరీక్షలు నిర్వహించి ముందుగా వ్యాధినిరోధక చర్యలు తీసుకొని ఆహారనియమాలు బోధించి బలవర్ధక మందులు వాడుచూ నిర్బంధ కుటుంబనియంత్రణ అమలుజరిపి జనన్నాల సంఖ్య తగ్గించాలి. గ్రామ పారిశుధ్యం నీటి కాలుష్యం పరిసరవాతావరణ కాలుష్యనివారణకు గ్రామ పరిపాలకులకు సలహాలు ఇస్తూ గ్రామ ప్రజలను చైతన్యపరుస్తూ వైద్య ఆరోగ్య సేవలు యూనిట్ పరిధిలో అందించుటకు యూనిటుకు ఇద్దరి

చొప్పున స్త్రీ పురుష వైద్య పట్టభద్రులను నియమించి కుటుంబనియంత్రణ జననాల అదుపుచేయుటకు తగ్గించుటకు ఒక్క సంతానంతో తృప్తిపడేవారికి 15 వేల రూపాయలు, అసలు సంతానం వద్దు అనుకునే వారికి 30 వేల రూపాయలు (వడ్డీతోసహా), స్త్రీ వయస్సు 50 సం॥లు పైబడినపుడు బాండు డబ్బు తీసుకొనువిధంగా ఆర్థిక బాండ్లు ప్రభుత్వం జారీచేసి జాతీయంగా యూనిటుసైజు జనసంఖ్య తగ్గించుటకు కృషిచేయాలి, మాతా శిశు సంరక్షణ ప్రత్యేకశ్రద్ధతో పరిరక్షిస్తూ వైద్యం చేయుటకు ధనం వ్యక్తికి 100 రూపాయలు చొప్పున లెక్కిస్తే ప్రతి యూనిటుకు 7 లక్షల 50 వేలరూపాయల చొప్పున, జాతీయంగా 1 లక్షా 25 వేల 333 యూనిట్లకు మందుల ఖర్చు, 9398 కోట్ల 87 లక్షల 50 వేల. రూపాయలు పరిపాలన వ్యయం యూనిటు 1 కోటి 2 లక్షల 50 వేల రూపాయలు చొప్పున 1,25,333 యూనిట్లకు 3133,32,50 వేల రూపాయలు వెరశి వైద్య ఆరోగ్య పద్దు 125,32/20 లక్షల రూపాయలు వైద్యపద్దుక్రింద ఖర్చు చేయవలసివున్నది.

3. పశు వైద్యం పశుగణ అభివృద్ధి :

మానవుని ప్రాథమిక నిత్యావసర వస్తువులు సరఫరాలో పాలు గుడ్లు మాంసం పశుజాతులనుండి సరఫరా చేయుచున్నవి: పశు మాంసం గ్రుడ్లు సరఫరాజాతుల ఆరోగ్యం మానవుని ఆరోగ్య సంరక్షణకు కారణంగా పరిణమించింది. పశు జాతుల ఆరోగ్యం మానవుని ఆరోగ్యంకన్నా మిన్నగా చూచుకున్నపుడు మానవుని మనుగడ మానవుని చేతులలో వుంటుంది. పశుపోషకులు పశువుకు

వ్యాధిసోకిన వెంటనే గుర్తించే విజ్ఞానం పశుపోషకులకు లేనందున పశుపోషకులు పశువుకు సోకిన వ్యాధిని గుర్తించేటప్పటికి వ్యాధి ముదిరి చాలా పశువులు చనిపోవటం జరుగుచున్నది. మాంసం ధర విపరీతంగా పెరిగిపోవటంలో మంచి స్థితిలోవున్న పశువులను పశువుల సంతలద్వారా కటికి దుకాణాలకు తరలించటం జరుగుచున్నది. ఇందు మూలంగా దినదినానికి పశుజాతి క్షీణించుచున్నది, పశుజాతి క్షీణించకుండా పశువులకు ముందుగా వ్యాధినిరోధకచర్యలు తీసుకొనుటకు మంచి స్థితిలో లేని పశువును వైద్యనిపుణుడు నిర్ధారించి పశువధశాలకు తరలించువిధంగా డాక్టరు సర్టిఫికేటు ఇచ్చిన పశువును పశువధశాలకు తరలించు పరిపాలన చర్యలు తీసుకొనుటకు యూనిట్టును ఒకరిచొప్పున పశువైద్య పట్టభద్రుని నియమించి, పశుసంరక్షణ పశుపోషణ పశుగణ అభివృద్ధి చేయుటకు జలచర ఉత్పత్తులు పెంపొందించుటకు యూనిటు 1 కోటి 5 లక్షల రూపాయలు పరిపాలన వ్యయం, 1 లక్షా 20 వేల రూపాయలు వెరశి యూనిటు వ్యయం 6 లక్షల 20 వేల రూపాయలు 1,25,333 యూనిట్లకు జాతీయవ్యయం 7470 కోట్ల 60 వేల రూపాయలు వ్యయంతో సంపూర్ణ పశువైద్యం పశుగణ అభివృద్ధి సాధించవచ్చు, జల చర జంతువులు పెంపొందించవచ్చు.

4. భూసార సంరక్షణ సస్యసంరక్షణ :

భారతదేశం కొంతవరకు వ్యవసాయకంగా అభివృద్ధి సాధించింది కాని, సంపూర్ణంగా అభివృద్ధి సాధించలేదు. 1993 భూమి గణాంకాలనుబట్టి 16 కోట్లు హెక్టారుల భూమి నీటిపారుదలల క్రింద

పంటపొలాలుగా సాగుచేయబడుచున్నవని 70 శాతం భూమి వర్షాధారపంటపొలాలుగా సేద్యం చేయబడుచున్నదన్న వివరములు వెల్లడైన తరువాత పంటల దిగుబడిని పరిశీలిస్తే వ్యవసాయం ఇంకా అభివృద్ధి దశను అందుకోలేదనిపిస్తుంది. కారణం వ్యవసాయ పరిశోధనలు ప్రయోగశాలలకే పరిమితికావటం వ్యవసాయదారును వ్యవసాయ విజ్ఞానం లేకపోవటం భూసార సంరక్షణకు తగిన చర్యలు తీసుకోకపోవటం భూమి నిస్సారం కావటం, భూమి బౌతిక భూసార సంరక్షణకు సస్య సంరక్షణకు సస్యపోషణకు ప్రతి చేనుకు ప్రతి పైరుకు ప్రతి రైతుకు సాంకేతిక శాస్త్రీయ విజ్ఞానం అందించి వృదా వ్యయాన్ని తగ్గించి ఆదాయాన్ని పెంపొందించు శిక్షణ ప్రతిరైతుకు అందిస్తే శాస్త్రీయ విజ్ఞానంతో తర్ఫీదుపొంది ప్రతి రైతు ఒక శాస్త్రవేత్తగా రూపుదిద్దుటకు యూనిటుకు ఒకరిచొప్పున వ్యవసాయ పట్టభద్రుని నియమించి వ్యవసాయ అనుబంధ పలు పరిశ్రమలు ఫల పుష్ప వనములు సామాజిక అడవులు పెంపొందించు పాలన కార్యక్రమాలు చేపట్టి, కుంటలు చెరువులు కాలవలు గట్లు కాళీపోరంబోకులు నందన వనాలుగా తీర్చిదిద్దు పాలన కార్యక్రమం చేపట్టుటకు సమగ్ర అభివృద్ధి సాధించుటకు యూనిటు 1 కి 4 లక్షల రూపాయలు చొప్పున వ్యవసాయ అభివృద్ధికి పాలన వ్యయం 1 లక్షరూపాయలు వెరశి 5 లక్షల రూపాయలు జాతీయంగా 1,25,333 యూనిట్లకు 6266 కోట్ల 65 లక్షల రూపాయలతో సంపూర్ణ వ్యవసాయ అభివృద్ధి సాధించవచ్చు, కేంద్రీయ వ్యవసాయ విధానాలు అవలంభించి సమగ్ర అభివృద్ధి సాధించు చక్కని పాలన విధానమిది.

5. వనరులు మానవశక్తి వినియోగం :

జాతీయంగా 18 కోట్ల 80 లక్షల కుటుంబాలుగా జన నివాసాన్ని నిర్ధారించి 40 శాతం కుటుంబాలు దరిద్రరేఖ దిగువ కుటుంబాలుగా నిర్ధారించి సంవత్సర ఆదాయం 15 వేల రూపాయలలోపు వారందరిని దరిద్రరేఖకు దిగువవారుగా గుర్తించి దరిద్ర నిర్మూలనకు పరిపాలన కార్యక్రమం చేపట్టటం జరుగుచున్నది. 40 శాతం దరిద్ర రేఖ దిగువ 7 కోట్ల 52 లక్షల కుటుంబాలు ఆర్థిక సహాయం పొందుటకు అర్హత కలవిగా గుర్తించి సహాయ కార్యక్రమాలు చేపట్టుటకు ముందు వారి వారి ఆదాయములు కంప్యూటరుద్వారా నిర్ధారించి 5 తరగతులుగా విభజించి గ్రేడులవారి 30 వేల రూపాయల నుండి 70 వేల రూపాయల వరకు సరాసరి 50 వేల రూపాయలు అందజేయువిధంగా ఆర్థిక కార్యక్రమం రూపొందించి సహాయ కార్యక్రమాలు చేపట్టి వనరులు మానవశక్తి వినియోగించి దరిద్రరేఖ దాటించు పాలన కార్యక్రమం అమలు జరుపుటకు యూనిటుకు ఒకరిచొప్పున ఇంజనీరింగు పట్టభద్రుని నియమించి గృహం ఒక పరిశ్రమగా హృదయం ఒక ప్రయోగశాలగా జాతిని తీర్చిదిద్దుటకు కావలసిన ధనం 75,200 కోట్ల రూపాయలు 1,25,000 యూనిట్లకు కంప్యూటరు నిర్ధారించిన విధంగా 7 కోట్ల 52 లక్షల కుటుంబాలకు పంచుటకు యూనిటుపాలన వ్యయం 1 లక్ష 25 వేలు చొప్పున 1,25,333 యూనిట్లకు జాతీయంగా పాలన వ్యయం 313,33,25 వేలు చేరసి దరిద్ర నిర్మూలనకు వనరులు వినియోగించి మానవశక్తికి పని కల్పించుటకు ప్రతి సంవత్సరం ప్రభుత్వంచేయవలసిన వ్యయం 75,513 కోట్ల 33 లక్షలు 25 వేలు, ఒక్క పంచవర్ష ప్రణాళిక కాలంలో

దరిద్ర రేఖ దాటించు పాలనాకార్యక్రమంఇది. మానవశక్తి మచ్చుకు వృధాకాని పాలనాకార్యక్రమం ఇది, ఏమిలేని నిష్టదరిద్రునికి పని కల్పించుటకు 70 వేల రూపాయలు ఒకేసారి ముట్టుచున్నవి. ఆర్థిక వనరులనుబట్టి ఈ మొత్తాన్ని '60 - 90 వేలు దామాష పెంచుకో వచ్చు. జవాబుదారి వృత్తిచేపట్టి శ్రమించి ఏమేరకయినా వాని ఆదాయం పెంచుకోవచ్చు. ఇంకొకరిని దేహి అనే పనివుండదు, ఆర్థిక సాంకేతిక వాణిజ్యపాలన సహాయం అందించు పాలనా యంత్రాంగం పర్యవేక్షణలో ధనం మానవశక్తి వృదాపోవు, అవ కాశం లేకుండా పకడ్‌బంది పాలన విధానం అమలుజరుగుతుంది. వనరులు మానవశక్తికి జవాబుదారిగా పని కల్పించబడింది. ప్రతినెల ఉత్పత్తి వివరాలు వ్యయ ఆదాయం తెలియజేయవలసివున్నది.

### 6. గృహనిర్మాణం :

గత 30 సంవత్సరముల నుండి ప్రభుత్వం పేదల ఇండ్ల నిర్మాణ కార్యక్రమం చేపట్టి కొనసాగిస్తూనే వున్నది. అయినను ఇంకా 15 శాతం ఇండ్లు నిర్మాణం జాతీయంగా జరుగవలసివున్నది. జాతీయంగా 2 కోట్ల 82 లక్షలు గృహనిర్మాణానికి గృహం ఒకటికి 25 వేల రూపాయలచొప్పున ఐదు సంవత్సరములలో పూర్తి చేయు పరిపాలన కార్యక్రమానికి ప్రతిసంవత్సరం 14 వేల 100 కోట్ల రూపాయల చొప్పున ఐదు సంవత్సరములలో 70,500 కోట్ల రూపాయలతో ఇండ్ల కొరతను పూర్తిచేసి పౌరుని ప్రాథమికహక్కులు అమలుజరిపి సామా జిక న్యాయం అమలుజరుపవలసివున్నది. విద్యా, విజ్ఞానం, వైద్యం, ఆరోగ్యం, నివాసం, పని పౌరుని ప్రాథమిక హక్కులు పూర్తి చేయు ఆర్థికపాలనా కార్యక్రమం పూర్తిగా రూపొందించబడుతుంది.

7. వెనుకబడిన ప్రాంత ప్రత్యేక అభివృద్ధి :

అడవులు కొండలు ఎడారి ప్రాంతములకు అభివృద్ధికి ప్రత్యేక పరిపాలన కార్యక్రమంచేపట్టి అమలుజరుపకుంటే ఎంత ధనం వారికి ఎదురు పెట్టినా సమస్థాయికి చేరలేరు. 1) రవాణాసౌకర్యములు, 2) ప్రయాణ సౌకర్యములు, 3) వార్తా సౌకర్యములు, 4) విద్యుత్ సౌకర్యములు, 5) టెలివిజన్ సౌకర్యములు, వాణిజ్య సౌకర్యములు వాని జీవనం మెరుగు పర్చుటకు 5 సంవత్సరములు ఆర్థిక పరిపాలన కార్యక్రమం చేపట్టి ప్రతిసంవత్సరం 5000 వేల రూపాయలు వ్యయం చేయుచూ 28000 వేలకోట్ల రూపాయలు హెచ్చించి వెనుకబడిన ప్రాంతాలను అభివృద్ధి జాతీయంగా అన్నివిధాలుగా సమానస్థాయికి చేర్చుటకు వెనుకబడిన ప్రాంతాలకు కావలసిన సదుపాయం కల్పించటం జరుగుతుంది.

8. జాతీయ జలవనరులు వినియోగం :

ప్రముఖ ఇంజనీరు డాక్టరు కె. యల్. రావుగారు గంగా, కావేరీని కలుపుతూ రూపొందించిన గార్లెండు కెనాలు స్కీము అమలు జరిపితే భారతదేశం వాతావరణం చల్లబడి సశ్యశ్యామలంగా మారుతుంది. ప్రతి గ్రామం చల్లటివాతావరణం సృష్టించుకొనుటకు కుంటలు చెరువులు విరివిగా త్రవ్వికాని నీరు నిల్వచేయవచ్చు. భూగర్భ జిలాశయం పెంచుకుంటే భూమి చల్లబడుతుంది. జాతీయ జల వనరులు కలుపుతూ త్రోవ్వకాలువలకు వంతెనలు డాముల నిర్మాణమునకు అనుబంధకాలువలు ఆనకట్టల నిర్మాణమునకు ఏ గ్రామానికాగ్రామం పాల్గొని చురుకుగా పని పూర్తిచేయు విధా

నంలో టెండర్లు రూపొందించి 5 సంవత్సరములలో కాలువలు చిన్న సన్న డాములు పూర్తిచేయువిధంగా ఆర్థికపాలనా కార్యక్రమం చేపట్టుటకు ప్రతి సంవత్సరం 20 వేల కోట్ల రూపాయలు వ్యయం చేసి 100 కోట్ల రూపాయలతో జాతీయ జల వనరులు వినియోగించు విధానం అవలంభించవలసివున్నది.

9. ప్రతిభ ఆధారంగా పరిపాలన :

దరిద్రరేఖ దాటించుటకు సమగ్ర అభివృద్ధి సాధించి స్వయం సమృద్ధి దేశంగా భారతదేశాన్ని తీర్చిదిద్దుటకు ప్రతి సంవత్సరం 1,85,882 కోట్ల 18 లక్షల 85 వేల రూపాయలు వ్యయంగా ఒక పంచవర్ష ప్రణాళిక వరకు కార్యక్రమం అమలుపర్చుటకు కావలసిన పరిపాలన యంత్రాంగం బాగా వుషారైనదిగా వుండాలి. పరిపాలన యంత్రాంగానికి వుండవలసిన అర్హతలు - 1) శ్రమించగలశక్తి 2) నిపుణత 3) ఉత్పత్తి పెంపొందించగల నేర్పరితనం 4) ప్రతిభ 5) భాధ్యత 6) అనుభవం 7) సేవాభావం 8) జవాబుదారిగా తగిన విజ్ఞానం అందించి వృథా వ్యయం తగ్గించగల విద్యార్హతకలిగి పని చేయకలిగినవారికే ప్రభుత్వం సేవకావృత్తులు కల్పిస్తుంది. ప్రభుత్వం సేవకావృత్తి పని బాధ్యతలు ఆధారంగా వృత్తి కొనసాగించబడు తుంది కాని ఉద్యోగం హక్కుగా గుర్తించబడదు. పౌరునికి కల్పించిన జీవనహక్కు ప్రాథమిక హక్కు కాని ప్రభుత్వం సేవకావృత్తి వాని సేవల ఆధారంగా వుంటుంది. సేవకావృత్తి ధర్మాన్ని ఏక్షణంలో వుల్లంఘించినా తక్షణం సేవాకావృత్తి నుండి తప్పించబడుతుంది. ప్రభుత్వం సేవకావృత్తిలో చేరినవారిని బదిలీలుచేయుటంవలన పాలన

సామర్థ్యం పెరగదు. సామాజిక శక్తులతో కలిశి పనిచేసేటప్పుడు సామాజిక తత్వ విచారణ పరిపాలన సేవాతత్పరులకు చాలా అవసరం. బాధ్యతాయుతమైన ప్రజాతంత్ర పరిపాలనలో ప్రభుత్వ పరిపాలన వృత్తి ఒక నిఘంటువు ప్రకారం నిర్వర్తించు వృత్తి ఆదర్శ ప్రజా రాజ్యంలో వృత్తి సేవాధర్మం వ్యక్తిజీవన ప్రమాణాన్ని నివారిస్తుంది, పెంపొందిస్తుంది.మానవుని జీవనప్రమాణం విద్యాప్రమాణం ఆరోగ్య ప్రమాణం ఆర్థికాభివృద్ధి పెంపొందించగలవారే పరిపాలన సేవకా వృత్తి చేపట్టుటకు అర్హత కలిగివుంటారు. అది చేయలేనివారు చదువు ఎంత చదివినా ప్రభుత్వం సేవావృత్తికి అనర్హులు, వివక్షతలు లేని వృత్తిధర్మం. ఇది జాతిక్షేమం, దేశక్షేమం, కోరే వృత్తి విధానమిది. జాతిని దేశాన్ని ముందుకు నడిపించే జాతీయ పరిపాలనా విధానమిది, మానవధర్మాన్ని ప్రజాతంత్ర ప్రభుత్వం పరిపాలనాధర్మాన్ని ప్రతిబింబించే పరిపాలనా న్యాయం ఇంతకంటే మంచిమార్గంలేదు, ఏ విధంగా పరిశోధించినా కనుపించదు. ప్రస్తుతపరిపాలనాయంత్రాగాన్ని పరిగణనలోకి తీసుకుంటే నూటికి 10 మందికి మించి పరిపాలనలో పనివుండదు. పరిపాలనాశాఖలు 10 కి మించి వుండవు, ప్రజాసంఘాలు అసలు వుండవు, రాజకీయనాయకులు వుండరు, రాజ్యాంగయంత్రం మినాహా వృత్తి సంఘాలకు స్థానం వుండదు. ఉత్పత్తి యూనిట్లలో భాగస్వామ్య సంఘాలు వుండవచ్చు. ప్రజాస్వామిక పరిపాలనలో నియంతృత్వ అధికారాలు స్వతంత్రించే నియంతృత్వ హక్కులు ఏవృత్తిలో చేరినవారికి వుండవు. స్వేచ్ఛగా జీవించే జీవనపథకం ప్రతి వ్యక్తికి హామియిస్తున్నందున వృత్తికి సంబంధించిన నియంతృత్వం ఎవరిలోవున్నా పరిపాలన పటుత్వం తగ్గించుమార్గం వున్నందున అధి

కార అనధికార నియంతృత్వం ప్రజాస్వామిక ప్రజాతంత్రం పరిపాలనలో చోటువుండకూడదు. అధికారంలోవున్న వ్యక్తి నియంతృత్వం జాతీయంగా పరిపాలనలో ప్రజలను ఎలా హింసిస్తున్నదో గమనించిన తదుపరి నియంతృత్వం దేనికి వుండకూడదనిపించింది.

- పంచమ భాగం -

ఆర్థిక సంస్కరణలు :

పరిపాలనా సంస్కరణకు ఆర్థికసంస్కరణ జోడించి, సంస్కరణ మార్గంలో నాలుగు అంచెల ప్రభుత్వాలు చిత్తశుద్ధితో శ్రమించి పనిచేస్తే భారతదేశానికి ఏ దేశము సాటిరాదు.

1. వృథావ్యయం తగ్గించటం
2. ఆడంబర వ్యయం తగ్గించటం
3. ప్రణాళికేతర వ్యయం తగ్గించటం
4. వనరులు పొదుపుచేయటం
5. వనరులు పరిమితిచేయటం
6. రుణవిమోచన
7. ఆర్థికవనరులు సమకూర్చటం
8. పన్నులు సరళీకరణ
9. వ్యక్తి ఆదాయం పెంపొందించటం

భారతదేశం స్వాతంత్ర్యం చేపట్టిన ప్రాజక్టులు పరిశ్రమలు వెంటనే ఉపయోగం, 1970 నాటికి పూర్తిస్థాయి ఉత్పత్తులు మొదలై దినదినానికి జాతీయ ఆదాయం పెరగసాగింది, జాతీయంగా పెరిగిన ఆదాయం తిరిగి మానవశక్తిని వినియోగించి ఉత్పత్తులు పెంచుటకు ఉపయోగ పడకుండా నల్లధనంగా మారి దేశంలోను విదేశాలలోను దాచటం జరిగింది, అలా దాచిన ధనం 1993 లో నల్లధనం కమిటి ఒకటి పత్రికా ప్రకటనలో ప్రతిసంవత్సరం 80 వేల కోట్లు రూపాయలు జాతీయధనం జాతికి ఉపయోగపడకుండా చీకటిబజారుకు పోవుచున్నదని ప్రకటించింది. 1996 జనవరి 30 తారీకున ఈనాడు పత్రిక ఎడిటోరియల్ లక్షల కోట్లలో అంచనాలకు మించి వున్నవని హావాలా లావాదేవీల రూపేణ విదేశబ్యాంకులలో పోగుబడ్డ మొత్తం ఐదు లక్షల కోట్ల రూపాయలని తెలియజేసింది.

ఆంధ్రజ్యోతి 1996 ఫిబ్రవరి 2 తారీకు శుక్రవారం ప్రకటించిన పేరు క్లైమ్సు ప్రకారం భారతదేశానికివున్న అప్పుకంటె ఎక్కువ డబ్బు విదేశమారకంనిధులు విదేశాలకు తరలివెళ్ళిందని దేశంలో దొంగచాటుగా చెలామణి అవుతున్న నల్లధనం పరిమాణం కనీసం 3 లక్షలకోట్లు వుంటుందని అంచనాగా ప్రకటించి, స్వాతంత్ర్యానంతరం దేశానికి తరలివచ్చిన బంగారం 10 వేలటన్నులకంటే ఎక్కువే వుంటుందని విదేశాలలో దాచిన సొమ్ము లెక్కిస్తే కనీసం 100 బిలియన్లు డాలరులు వుంటుందని ప్రచురించింది. ఇది భారీ పెట్టుబడి విధానంమీద నిర్ధారించినదే మధ్యతరగతి వ్యాపార పారిశ్రామిక రాజకీయ రాజకీయేతర ఆదాయములలో నల్లధనం చాలావున్నది.

జాతీయంగా దేశవిదేశాలలో వున్న జాతీయ ఆదాయం దేశ అప్పులు అవుసరాలుపోను విదేశాలకు పెట్టుబడి పెట్టవచ్చు, నల్ల ధనాన్ని అక్రమ సంపదను ప్రభుత్వ ఖజానాకు తరలించాలి, సన్న చిన్నకారు మధ్యతరగతి ఆదాయం ప్రజలపై ఆర్థికభారం పడకుండా ఆర్థిక విధానాన్ని చక్కదిద్దాలి. సంపన్నులపై తాత్కాలిక పన్నుల భారం మోపి 5 సం॥లు ప్రత్యేకపన్నులు, ప్రతి సం॥ము 1 లక్ష 90 వేల కోట్లరూపాయలు వసూలుచేసి దేశవిదేశ ప్రభుత్వ రుణములు తీర్చువరకు ప్రభుత్వం కఠినపాలన నిర్ణయాలు అమలుజరపాలి. విదేశ రుణములు దేశ రుణములు ప్రభుత్వాన్ని బాధిస్తున్నవి. ప్రభుత్వరుణం ప్రజలరుణంగా భావించి దేశాన్ని అభివృద్ధిబాటలో నడిపించు పరిపాలన కార్యక్రమంలోనే రుణ విముక్తి కార్యక్రమం జోడించి రుణములు తీర్చి పటిష్టమైన పాలనాదేశంగా భారత ప్రజాతంత్ర దేశానికి కీర్తి ప్రతిష్టలు పెంపొందించాలి.

పరిపాలనా సంస్కరణలు అమలుజరిపితే పరిపాలన వ్యయం ఆదాయంలో 10 శాతానికి మించదు, రక్షణవ్యయం భారీగా పెంచినా ఆర్థిక ఇబ్బంది వుండదు. పరిపాలన పొదుపు వలన వనరులు పొదుపు వలన ప్రణాళికేతరవ్యయం పొదుపువలన ఆడంబర వ్యయం తగ్గించుట వలన సబ్సిడీలు తగ్గించుటవలన 1 లక్ష 90 వేలకోట్ల రూపాయలు పొదుపుతో నిరుద్యోగం దరిద్రం నిరక్షరాస్యత తొలగించుకోవచ్చు ఒక 5 సం॥లు ఆదర్శ ప్రజారాజ్యం హద్దులతో క్రమశిక్షణలో అదుపుచేయదలచి కఠిననిర్ణయాలు తీసుకొంటుంది. తదుపరి ఎవరికి ఎటువంటి ఇబ్బందులు వుండవు. ప్రజాతంత్ర పరిపాలన ప్రజలను పాలనాయంత్రాంగాన్ని రాజకీయ యంత్రాంగాన్ని సరియైన

మార్గంలో పెట్టి నిజమైన ప్రజాస్వామిక పాలనాధర్మాలు అమలుజరుపు తుంది. ప్రజలు పాలనయంత్రాంగాలు రాజకీయ న్యాయయంత్రాం గాలు గుర్తించి బాధ్యతాయుతంగా నడుచుకొను తర్ఫీదుపొందు కాలంగా 5 సంIIలు పాలనాకార్యక్రమం రూపొందుచున్నది. ఈ 5 సంIIలు కోర్కెలసాధనకాలం కాకుండా విధానాలు నేర్చుకునే కాలంగా గుర్తింపుపొందుతుంది. ప్రత్యేకపన్నులు ఆదాయవర్గాలకే పరిమితి చేయబడుచున్నవి. దేశస్వాతంత్ర్యానంతరం 1) సంస్థానాలు 2) రాజులు 3) జమిందారులు 4) జాగీరుదారులు 5) అగ్రహారీకులు 5) భూస్వాములు ప్రభుత్వానికి సహకరించి వారి వారి ఆస్తులు ప్రభు త్వానికి దాఖలుపర్చి జాతీయవిధానాన్ని గౌరవించినారు జాతీయ విధానం దెబ్బతిననందున తిరిగి ఈనాడు జాతీయవిధానాన్ని ఆదు కొని జాతీయవిధానాన్ని గౌరవించవలసిన బాధ్యత ఆదాయంలో వున్నవారి అందరికి వున్నది. అందరి సహకారం కోరటం జరుగు చున్నది. చెదిరిపోయిన జాతీయవ్యవస్థను చక్కదిద్దు బాధ్యత అంద రిపై వున్నది.

1. నివాసగృహాలమీాద ప్రత్యేకపన్ను, ప్రతి ఇంటిని వెల కట్టి 4 లక్షల రూపాయలువరకు ప్రత్యేకపన్నునుండి మినహాయింపు యిచ్చి, ఆపై వెలకలిగిన ప్రతి రూపాయికి 5 పైసలుచొప్పున ప్రత్యేక పన్ను విధించి ఐదు సంవత్సరములు వసూలుచేయాలి.

2. బహుకుటుంబాలు నివసించే ఇండ్లకు ప్రతి కుటుంబానికి 3 లక్షల రూపాయలు వరకు పన్నునుండి మినహాయింపు యిచ్చి, మిగిలిన వెలకు ప్రతి రూపాయికి 5 పైసలుచొప్పున ప్రత్యేకపన్ను విధించి వసూలుచేయాలి.

3. 1) పలు అంతస్థుల భవనములు 2) పలు గృహ సముదాయములు 3) వాణిజ్యసముదాయములు 4) అద్దెభవనములు 5) లాడ్జీలు 6) హోటళ్ళు 7) ఆసుపత్రులు 8) క్లబ్బులు, ఆస్తులు ఆదాయము వెలకట్టి నెలకు 5 వేల రూపాయలు ఆదాయంవరకు ప్రత్యేక పన్నునుండి మినహాయింపు యిచ్చి మిగిలిన ప్రతిరూపాయికి 5 పైసలు విధించి వసూలుచేయుటేకాక నిత్య ఆదాయంపై రూపాయికి ప్రత్యేక పన్ను విధించి వసూలుచేయాలి.

4. సినిమాహాలులు వెలకట్టి ప్రతిరూపాయికి 5 పైసలు చొప్పున ప్రత్యేకపన్ను వసూలుచేయుచూ నిత్యం వసూలయే కలెక్షను నుండి రూపాయికి 5 పైసలు వసూలుచేయాలి.

5. 4 చెక్కులు ఆపై చెక్కులు కలిగిన రవాణావాహనాల మీద పన్ను ప్రతివాహన యజమానికి ఒక వాహనంపన్నునుండి మినహాయింపు యిచ్చి మిగిలిన వాహనాలు వెలకట్టి, వెలప్రకారం ప్రతి రూపాయికి 5 పైసలు చొప్పున ప్రత్యేకపన్ను విధించి వసూలు చేయాలి.

6. టీవీలమీద పన్ను, ప్రతి టీవీకి 10 వేల రూపాయలు వరకు పన్నునుండి మినహాయింపు ఇచ్చి మిగిలిన వెలకు ప్రతి రూపాయికి 5 పైసలు చొప్పున ప్రత్యేకపన్ను విధించి వసూలుచేయాలి.

7. చిట్ ఫండ్ ఆర్థిక పెట్టుబడి సంస్థలమీద పన్ను రూపాయికి 10 పైసల చొప్పున విధించి వసూలుచేయాలి.

8. ఇన్సూరెన్సు పాలసీలపై పన్ను ఒక లక్షరూపాయల వరకు పన్ను నుండి మినహాయించి మిగిలిన పాలసీపై ప్రత్యేక పన్ను రూపాయికి 5 చొప్పున విధించి వసూలు చేయాలి.

9. కిసాన్‌వికాస్ పత్రాలు, ఇందిరావికాస్ పత్రాలు, నేషనల్ సేవింగ్స్ ఖాతాలు ప్రభుత్వ రుణపత్రాలు బ్యాంకులు వగైరాలపై ప్రత్యేకపన్ను 40 వేల రూపాయలవరకు ప్రత్యేక పన్నునుండి మినహాయింపు ఇచ్చి 40 వేలకు పైబడిన ప్రతిరూపాయికి ప్రత్యేకపన్ను రూపాయికి 5 పైసలు విధించి వసూలుచేయవలసివున్నది.

10. ప్రయివేటు ట్రష్టు ఆస్తులపై పన్ను ప్రయివేటుట్రష్టు ఆస్తులుగా నమోదైన విద్య వైద్యం ధర్మసంస్థలు ఆస్తుల పన్నునుండి మినహాయించి మిగిలిన సంస్థలు అన్ని ఆస్తులు నెలకట్టి వెలఆధారంగా ప్రత్యేకపన్ను రూపాయికి 5 పైసలు విధించి వసూలుచేయవలసివున్నది.

11. పండ్లతోటలకు ప్రత్యేకపన్ను, పండ్లతోటలు పెంచి పోషించే రైతులకు పంటభూములలో టేకు, సర్వీసుబాదులు, యూకలిప్టు సుబాబులు మొదలగు తోటలుపెంచే రైతులకు ప్రతిరైతుకు రెండు ఎకరముల తోటలకు పన్నునుండి మినహాయింపు ఇచ్చి, మిగిలిన ప్రతి ఎకరము ఆదాయంమీాద ప్రత్యేకపన్ను రూపాయికి 5 పైసలు విధించి వసూలుచేయవలసివున్నది.

12. పట్టణ నగర ఇండ్లస్థలముల పన్ను ప్రతి ఇంటికి 10 సెంట్లు అదనపు స్థలమునకు పన్నునుండి మినహాయింపు యిచ్చి,

మిగిలినస్థలముగ చ॥ గజమునకు 100 రూపాయల వెలచొప్పున ప్రత్యేక పన్ను రూపాయికి 5 పైసలచొప్పున విధించి వసూలుచేయవలసివున్నది.

13. పట్టణ నగర పరిధిలో ఖాళీస్థలములు, ప్లాట్లు వేసివుంచిన వారికి చదరపుగజం 1 కి 100 రూపాయలున్నూ, నగర వెలుపల పట్టణ వెలుపల ప్లాట్లువేశి వుంచినవానికి పరిశ్రమల పేరున రిజిష్టరు పొంది ఖాళీగా వుంచినవాని స్థలములకు చదరగజం 1కి 50 రూపాయలచొప్పున వెలకట్టి రూపాయికి 5 పైసలు చొప్పున ప్రత్యేకపన్ను విధించి వసూలుచేయవలసివున్నది.

14. రాజకీయాలలో చేరిననాటి వాని ఆస్తులు, ఆదాయములు తదుపరి ఏవిధంగా ఆస్తులు సంపాదించింది, కంప్యూటరుద్వారా అంచెనా వేసి అక్రమంగా పెంచిన ఆదాయం లెక్కకట్టి ప్రత్యేకపన్ను రూపాయికి 10 పైసలు చొప్పున పన్నువిధించి వసూలుచేయవలసివున్నది.

15. వేతనములమీద పన్ను, వేతనము తీసుకునే ప్రతి వేతనదారుకు 1 సం॥కి 22 వేల రూపాయలు పన్నునుండి మినహాయింపు యిచ్చి, మిగిలిన ప్రతి రూపాయికి 5 పైసలచొప్పున ప్రత్యేక పన్ను విధించి, వసూలుచేయవలసివున్నది.

16. వ్యాపార ప్రచార ప్రకటనల బోర్డులపై పన్ను, ఒక్కొక్క బోర్డుకు ఒక్కొక్క ప్రకటనకు 1000 రూపాయలు విలువ వరకు పన్ను నుండి మినహాయింపు యిచ్చి, మిగిలిన విలువకు రూపాయికి 10 పైసల చొప్పున పన్ను విధించి, 5 సం॥లు పన్ను వసూలుచేయాలి.

17. బ్యాంకులు తీసుకునే వడ్డీ నూటికి 4 శాతంగాను పరిశ్రమలకు బ్యాంకులు పెట్టుబడి పెట్టే వడ్డీ రు. 2-75 పైసలనుండి రు. 5-75 పైసలు చిన్న పెద్ద ఉత్పత్తులు స్థితినిబట్టి వుంటుంది.

ఈ పన్నులవిధానం ఉత్పత్తిదారులపై పడదు. వ్యాపారులపై పడదు. వినియోగదారులపై పడదు. రవాణాపై పడదు. ధరలకు స్థిరత్వం కల్పించి, కాశ్మీరం నుండి కన్యాకుమారి వరకు వినియోగ ధరలు స్థిరంగా అందించుటకు రవాణా సబ్ సిడి కల్పించబడుచున్నందున నష్టాలతో పనిలేని వ్యాపారవిధానం అందరికి లాభసాటిగా వుంటుంది. ఆస్తులు భాగావుండి ఆదాయం తగ్గిపోయిన 5, 6 శాతం కుటుంబాలకు ఈ ప్రత్యేక పన్నులు బారం కావచ్చు. బాధలుపడవచ్చు కాని జాతీయవిధానం అయినందున ఆస్తులువున్నవారు పన్నులు చెల్లించటంలో బాధపడక తప్పదు. పన్నులు చెల్లింపుకు కొంత ఆస్థి తగ్గుతుంది కాని, ఆస్థిలేనివారు కారు. మిగిలిన 94.95 శాతం వారికి ప్రత్యేక పన్నులవలన ఆదాయంలో కొంత తగ్గుతుంది కాని లాభాలు పూర్తిగా తరిగిపోవు. జాతీయవిధానాన్ని సామాజిక న్యాయాన్ని అమలుజరుపుటకు 5 సం॥లు అందరు సహకరించాలి. సామాజిక న్యాయం అమలుపర్చాలి. జాతీయభావం అందరికి కల్పించాలి. భారతదేశాన్ని ప్రశాంత నిలయంగా మార్పుతీసుకవచ్చుటకు ప్రతి ఒక్కరు కంకణధారులు కావాలి. విజయం సాధించాలి.

ము గిం పు :

'నమూనా రాజ్యాంగం' రచనలో సామాజిక చైతన్యం సామాజిక పునరు నిర్మాణం, రాజకీయ చైతన్యం, రాజకీయ పునరు నిర్మాణం, పరిపాలనా చైతన్యం, పరిపాలన పునరు నిర్మాణం, న్యాయ చైతన్యం, న్యాయ పునరు నిర్మాణం, బాధ్యతలు, హక్కులు, హద్దులు, విలువలు, పరిరక్షణ, ప్రతివ్యక్తి, ప్రతివృత్తి, కర్తవ్యంగా రచించబడిన ఆదర్శ ప్రజారాజ్య నమూనా రచన సమాప్తం.

— జై హింద్ —